# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కల్పితము

సంపుటము 23 ఏప్రియల్ 1980 సంచిక 4

చిత్రము : — కరుణాంతరంగా !



చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " .../-5-''80 అనియుండిన, మీ చందా మే నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) ఏప్రియల్ నెల 30 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

: శ్రీ వారి కార్యక్రమములు :

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

16

సమస్తశాస్త్రములకు వేదమే మాతృదేవి. ఇది పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమున వెలువడుచున్నది. దీనిని మహాతపోధనులైన మహర్షులు శబ్దరూపమున గ్రహించుకొని దానిని శిష్య సాంప్రదాయానుసారముగ లోకమునకు చాటిరి. ఒకరినుండీమరొకరు శ్రవణేంద్రియములద్వారా పొందుటచే, అనగా వినుటచే దీనికి శ్రుతిఅని పేరు వచ్చెను. ఇవి అనంతములైనవి. వీటికి కర్త యెవ్వరనియు వారి నామధేయములేయవియనియు ఎవ్వరును ఇంతవరకూ తెలుపలేకపోవుచున్నారు. దీనిని ఉచ్చరించిన వాడు కీర్తికామిత్వరహితుడయి ఉండవలెను. లేకుండిన ఈ వేదమున తన పేరేక్కడనూ సూచించ లేదు. ఇతను కుల గోత్రాదులు లేనివాడయి ఉండవచ్చును. లేకుండిన ఒక కులమునకును ఒక గోత్రమునకూ సంబంధము లేక సమము గావించుట తటస్థించెను. ఇతడు సర్వజ్ఞుడని ఋషులు నిర్ణయించిరి. సర్వజ్ఞునకే ఈ సమత్వము సహజము.

అట్టి సర్వశక్తిమయుడే వేదమునకు కర్త యనుట సమంజసము. 'విద్' అనుధాతువు నుండీ వేదమను పదము పుట్టినది. 'విద్' అనగా తెలియుట "విదం త్వనేనేతి వేదః" సర్వము తెలియ జెప్పునది అనియు దీని అర్థము. ఇది బుద్ధికిగానీ, అనుభవమునకుగానీ తేల్చి చెప్పలేనట్టిది. మానవుల శ్రేయస్సుకు కావలసినట్టిదానిని ఈ పవిత్రవేదము తెలుపుచున్నది. సర్వదుఃఖములను నివారణచేయు ఉపాయమునుజూపుచున్నది. శాంతమునకు తగిన సాధనములనుకూడనూ తెలుపుచున్నది వేదము. ఈ వేదము

యొక్క ఆదిని, అంత్యమును ఇంతవరకూ ఎవ్వరునూ సరిగా తెలుసుకొనలేకపోవుటచేత, దీనిని అనాది అని, సనాతనమని చెప్పబడెను. ఆద్యంతములు కానరాకపోవుటచేత వీటినే నిత్యములని కూడా అనవచ్చును.

మానవుల బుద్ధి దోషములతోకూడినది. అట్టి పురుషబుద్ధిసంబంధములు ఎట్టివీ లేనివగుటవలన వేదములు కలుషరహితములగుటవలన అపౌరుషేయములనికూడా చెప్పవచ్చునని చెప్పబడుచున్నవి.

వేదములలో తెలుపబడిన ప్రతిశబ్దమునకూ వేదమే ప్రమాణము. దీనిపై విశ్వాసబుద్ధికలిగి, ప్రమాణబుద్ధి కలిగినవారలకు ఇది స్వానుభవమగును. ఇట్టి అనుభములనందిన వారే మహర్షులు. వారే వేదములను ప్రమాణరూపములుగా కొనియాడిరి. ప్రత్యక్షానుభవములనిరి. ఇవి దేశకాలాదులకు అతీతమైనవి. ఈ వేదములు భారత దేశమునకేకాక ప్రపంచమునకంతటికినీ ప్రమాణములు; మూలాధారములు అని నిశ్చయముగా చెప్పవచ్చును. వేదమతము జనించినది ఎప్పుడో! మిగిలిన మతములు జన్మించినవి నిన్నా నేడు. ఇదే ఇతరమతములకు వేదమతమునకు గలవ్యత్యాసము. కనుక ఏదైనా తెలుసుకోవాలంటే, మానవునకున్న సాధనసామగ్రితో తెలుసుకొనుటకు ప్రయత్నించిన తేలదు. ఇది మానవబుద్ధి ఒక హద్దునకు మాత్రమే చెందును. బుద్ధిగ్రాహ్యమతీంద్రియము. బుద్ధికి అతీతమైనది వేదము. మానవబుద్ధి సంకుచితము. అందువలన, ఈదృశ్యకల్పితమైన ప్రపంచమే ఇహపరములనుకొను వారలందరికీ ఈ బుద్ధిజాడ్యము ఆవరించుచుండును. ఇట్టి సత్యమును గుర్తించిన వేదమాత ఈ మానవులను ఉద్ధరించుటకై మానవులను సంతృప్తిపరచుటకై ఒక కాలమునేర్పరచినది. అవే సంవత్సరములు, మాసములు, దినములు, ఘడియలు, విఘడియలు. ఈకాలమానము మానవులకే కాక దేవతలకు కూడా సంబంధించినది. జీవుడు దేశకాలములచే బంధింపబడి సంసారచక్రమున చిక్కుకొని గిర గిర తిరుగుచు అందుండి బయటపడు ఉపాయము తెలియక బాధపడుచున్నాడు. అట్లున్నను అతడు దేశకాలములకు అతీతుడు. ఆ విషయాన్ని గ్రహింపజేసి, అతనిని బంధవిముక్తునిజేసి, ఉద్ధరించుటకే వేదమాత పూనుకొన్నది. వేదమాత జీవుని సంతృప్తిపరచి సంశయనివృత్తిని అందించునుగానీ, అతనిలో విప్లవమును లేవదీయదు. ఇది ప్రాజ్ఞులకు సువిదితము.

భూమికి ఆకర్షణశక్తి కలదు. అది ఎప్పటినుండీ కలదన్న విషయము అందరికీ తెలియదు. ఇది భూమితోపాటే జనించినది. భూమి, దీని ఆకర్షణ శక్తి, రెండునూ అవినాభావసంబంధము కలవి. భూమిలోని ఆకర్షణశక్తి ఏదో కొంతమందికి తెలియకుండినంతమాత్రమున భూమిలోని ఆకర్షణ శక్తి కనుపించకపోయినంతమాత్రమున భూమిలో ఆకర్షణశక్తి లేదని చెప్పుట వెఱ్ఱితనము. భూమితోపాటు పుట్టిన ఆకర్షణశక్తిని ఎవరూ తెలుసుకొనలేకపోయిరి. వారు తెలుసుకొనకపోయినప్పటికినీ ఆకర్షణశక్తి ఉండియే యున్నది. కడకు అనేక ఆదర్శములతో పరిశోధనలతో పాశ్చాత్య భౌతికశాస్త్రజ్ఞుడు న్యూటన్ అనువాడు భూమికి ఆకర్షణశక్తి కలదని చాటెను. అతడు చాటినప్పటినుండీ భూమికి ఆకర్షణశక్తి కలదని లోకము విశ్వసించినది. కానీ లోకము విశ్వసిం

చకపూర్వముకూడనూ, పరిశోధించకపూర్వమూ ఈ ఆకర్షణశక్తి ఉన్నది. ఇది క్రొత్తగా అప్పటికప్పుడు పరిశోధనలతో ఉట్టిపడినదికాదు. అటులనే నిత్యసత్యములైన వేదములు తమ అనుభవములోనికి భారతీయులు తెచ్చుకొనకపూర్వముకూడనూ ఉన్నవి. భూమికి ఆకర్షణశక్తి ఉన్నదని పాశ్చాత్యభౌతికశాస్త్రజ్ఞుడు ఎట్లుచెప్పెనో, సమస్తమునకువేదములు ఆధారమని భారతీయులు పరిశోధనలలో తేల్చి ఋజువుచేసిరి.భారతీయులు కూడను పరిశోధనతో అనుభవించకపూర్వము కూడనూ ఈ వేదములున్నవి. న్యూటన్ కనిపెట్టిన ఆకర్షణశక్తి ఒక పాశ్చాత్యభూమికేకాక యావత్ప్రపంచమునకు ఎట్లు సత్యమో, భారతీయులు కనిపెట్టిన వేదములు భారతీయులకేకాక యావత్ప్రపంచమునంతయూ శబ్దరూపమున నిండియున్నవి. వేదములకు భారతదేశమే జన్మస్థానమన చెల్లదు; భారతీయులు కనిపెట్టిరి మాత్రమే! ఒక చోట జరుగు సంఘటన వేరొక చోట ఎందుకుజరుగలేదను శంక యపభ్రంశము. ఏది ఎప్పుడు ఎక్కడ జరుగవలెనో అది కర్తయే నిర్ణయించగలడు. నిర్ణయప్రకారము జరుగును.

వేదములు పుట్టుటకును వర్ధిల్లుటకును భరతఖండముయొక్క వాతావరణము అనుకూలముగా నుండినది. కర్మనిష్ఠులైన ఋషులు, యోగులు, కర్మభూమియైన, యోగభూమియైన, త్యాగభూమియైన, భరతఖండమునందు జననమొందుట చేత, అట్టివారలహృదయములనే ఆ వేదము ఆకర్షించెను. ఇతరభూములు భోగభూములు అగుటచే ఐహికవాతావరణము ఆ భూములలో అమితముగా విజృంభించుటచే, ఇతరఖండములు ఈ వేదశబ్దమును సులభముగా అర్థముచేసుకొనలేవు. ఆముష్మికముతోపాటు ఐహికమునుకూడా కలిగి యుండునది భరతభూమి. కనుక భారతీయుల భాగ్యమా! అన్నట్లు వేదమాత భారతభూమిలో అవతరించెను. వ్యక్తమాయెను.

వ్యక్తముకాకపోయినంతమాత్రమున ఇతర దేశములలో వేదమాత లేదనచెల్లదు. ఆకర్షణశక్తి అన్ని దేశములలోని భూమికీ ఉండినటుల వేదశబ్దము అన్నిఖండములందునూ ఉన్నది. వేదము సర్వవ్యాపి. భారతదేశమునందుగల ఋషిపుంగవులు తమ తపశ్శక్తితో, ఏకాగ్రతతో, ఆ పవిత్రశ్రుతిని అందుకోగలిగిరి. ఆ శబ్దస్వరూపమును చూడగలిగిరి; అనుభవించగలిగిరి. వారు అనగా మహర్షులు స్వార్థరహితులగుటచే, ప్రేమస్వభావులగుటచే, తాము వినిన వాటిని అనుభవించిన వాటిని, పరులశ్రేయము నాశించి వేదరసమును భద్రపరచి, తమతమ చెంతచేరిన వారలకు అందించుచువచ్చిరి. కనుక అందించిన మహర్షులను మంత్రద్రష్టలని నుడివిరి. వారలద్వారా శిష్యపరంపరగా యుగయుగములనుండీ ఈ వేదవాణి దేశమును వ్యాపించెను. అనంతమైన ప్రవాహమువలె అన్ని దిశలా ప్రవహించెను. అగోచరమైన ఈ వేదమును, అవ్యక్తమైన ఈ వేదమును, వ్యక్తపరచిరి. కనుక వేదమునకు ఋషులేద్రష్టలు అని భారతీయులు తెలుసుకొనిరి.

(సశేషము)



# ఏకంలో అనేకం

తన మాయోపాధి నధిష్ఠించిన ఆ పరమేశ్వరుని అనంతానందవిశ్వలీలావిలాసంలో అవతారమనే విన్యాసం ఒకటి. సృష్టిస్థితిలయనిబద్ధమైన ప్రకృతిని పటిష్ఠంగా నిర్వహించే నిమిత్తమే అవతారం. ఈప్రకృతి తత్త్వముకన్నను భగవదవతారతత్త్వము ఎంతో అనూహ్యము అనిరూప్యము అగాధము సుందరమును. తరాలకొద్ది పరిశోధించుకొలది ప్రకృతి రహస్యము విజ్ఞానశాస్త్రజ్ఞులకు దురవగాహమగుచున్నది. సనకాదిమహామునులును భగవత్తత్త్వము అణువులోని పరమాణువంతైనను తమకు అవగాహన కాలేదన్నారు. కర్త భోక్త సాక్షియు తానే అగు ఆపరాత్పరుడు తన మాయచే తానే బాహ్యానికి ఈ ముప్వురుగా తోచుచు ఆడుకొని ఆనందించుచున్నాడు. ఎంతటి మహాభక్తులును తమతమ ప్రాప్తిమేరకు అందిన ఆయా యవతారదివ్యానుభవమునందుకొని ఆనందించి ప్రపంచానికందించినవారేగానీ, నిర్వచనమునకు పూనినవారుగానీ, పారంగతులమని పల్కినవారుగానీ లేరు. ఆత్మానందభూతినందినజ్ఞానులును అనుభవింపగలరేగానీ అది ఇట్టిదని చెప్పజాలరు. అందువల్లనే ఒక మహనీయుడు "ఇషుక్షయాత్ నివర్తంతే నాంతరిక్షక్షయాదిషుః। మతిక్షయాత్ నివర్తంతే నగోవిందగుణక్షయాత్'–'ప్రయుక్తమైన బాణము దానివేగశక్తి క్షీణించుటచే పైకిపోలేక క్రిందికిమరలునుగానీ అంతకుపైన ఆకాశములేక కాదు. అట్లే ఎంతటివారేగానీ తమతమ బుద్ధికందిన కొలది మాత్రమే భగవల్లీలావిలాసము నుగ్గడింపగలరేగానీ అంతకుమించి భగవన్మహిమలేక కాదు''–అన్నాడు.

శ్రీకృష్ణావతారములో సృష్టికర్తయగు బ్రహ్మకథను మనమీసందర్భములో గుర్తుకు తెచ్చుకోదగియున్నది. కృష్ణపరమాత్మశక్తి నిపరీక్షింపదలంచిన విరించి బాలకృష్ణుని వెంటనున్న గోవత్సములను గోపబాలురను మాయముచేసి దాచెను. అపుడు చిన్నికృష్ణుడు తన మాయచే తానే ఆవత్సములు బాలురునై తన బాలకృష్ణరూపముతో తానుండుచునే ఆ మందను గాచుచు ఆ గోపబృందముతో ఆడుచు పాడుచు ఒక యేడు గడపెను ఈ వింతచూచి, తోచక నిల్చుండిన బ్రహ్మకు ఇంకను దిగ్భ్రాంతి గల్గునట్లుగా ఆ బాలకులందరు చతుర్భుజులు పీతాంబరశంఖచక్రవనమాలాధారులు సకలసురమునిబృందసేవితులునై అతని యెదుటగన్పించిరి. ఆ దివ్యతేజోమూర్తులను పరివేష్టించి సన్నుతించుచున్న సురసంఘములో తనవంటి బ్రహ్మదేవులనుగూడ ఈ విరించి కాంచెను. ఈ అతివిచిత్రసన్నివేశముగాంచి అతడుదిక్కుదోచక నిశ్చేష్టితుడైనిల్చెను. కృష్ణపరమాత్మ అతని దైన్యముంగని కనికరించి ఆ రూపములన్నియు చిటికెలో మాయము గావించి, బృందావనసంచారియై చద్దియన్నపుముద్ద చేతియందుంచుకొని దూడలను వెదకుచు గోపబాలకులను బిల్చుచు ఒకే బాలకృష్ణుడుగా మరల బ్రహ్మదేవునకు గాన్పించెను. అపుడతడు కృష్ణపరమాత్మను స్తుతించుసందర్భములో

'ఒకడైయుంటివి, బాలవత్సములలో నొప్పా
రితి, వంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై, సంప్రీతి,
నేఁగొల్వగా,
ప్రకటశ్రీగలవాడవైతి, వటపై బ్రహ్మాండ
ముల్ సూపి. యొ

ల్లక యిట్లొక్కడవైతి. నీవివిధలీలత్వంబు గంటింగదే।

ఈ నాడు జన్మాంతరసుకృతవంతులపాలి సొమ్ముగా వెలసియున్న శ్రీసత్యసాయిభగవదవతారలీలావిలా సమును పరికించినచో కృష్ణావతారలీలలు మరొక తీరున ఇందు మనకు గోచరించుచున్నవి. శ్రీరామ, కృష్ణ, శివ, దత్తాదిస్వరూపునిగా షిర్డీసాయిని అను భవజ్ఞులు ఆరాధించుచున్నారు. ఆ షిర్డీమూర్తి కభేద తత్త్వముగా, మనభగవానుని, మనమందఱము సర్వ దేవతాస్వరూపునిగా పూజించుచున్నాము. వినాయక చతుర్థియున్నగు పర్వదినములలో ఆయాదేవతాప్రతి మలను ఆయా అష్టోత్తరశతనామాదికముతో పూజిం తుమేగానీ, వినాయకచవితినాడు రాధాకృష్ణప్రతిమను ఆరాధింపము. రాజరాజేశ్వరీ ప్రతిమను రామాష్టోత్తర శతనామముతో పూజింపము. మన స్వామి వర్ధంతి నాడుగానీ, శ్రీరామనవమి శివరాత్రియున్నగు పర్వ దినములందుగానీ మన భగవానుని పటమున కన్ని వైపుల రామ, కృష్ణ, శివ, లలితాదిదైవతముల పట ములనుంచి ఆయా దైవతనామములతోను మన స్వామి యష్టోత్తరశతనామములతోను, మన స్వామిని, ఇతరవతార దైవతప్రతీకలను, నిస్సంశయముగా పూజిం తుము. నామసంకీర్తనలో మన స్వామి నామ మును సమస్తదైవతనామములతో సమ్మేళనము చేసి గానముచేసి ఆనందింతుము. స్వామి సర్వదేవతాస్వరూ పులనెడి మన యీవిశ్వాసమునకు స్వానుభవము అప్తు లయనుభవమును మూలాధారములు. తత్తదిష్టదేవతా స్వరూపులుగా తన భక్తులకు స్వప్నదర్శనమిచ్చినది మన స్వామియే అని నిరూపితములైన సాక్ష్యాధారములు న్నవి. ప్రత్యక్షముగా అనేకసమయములలో వారి వారి యిష్టదేవతాస్వరూపుడుగా భక్తులకు స్వామి దర్శనమిచ్చిన నిదర్శనములు కోకొల్లలు.

—రామశర్మ, వెంకటగిరి.

# మేలుకొలుపు

సత్యసాయీ మేలుకో—శ్రీ
సద్గురూ మమ్మేలుకో।
ఈశ్వరీసుత మేలుకో—పర
మేశ్వరా మమ్మేలుకో।
మేలుకో హరి మేలుకో—మేలుకొని మమ్మేలుకో।
ప్రణవనాదము ప్రజ్వరిల్లెను
ప్రకృతియే విల పులకరించెను
విప్రవర్యుల వేదమంత్రము
వీనులకు కడువిందొనర్చెను
శక్తిదాతా మేలుకో—శివ
శక్తిశ్రీహరి మేలుకో। ॥సత్యసాయి॥
పక్షులాదిగ పలుకదొడగెను
యక్షకిన్నరులేగుదెంచిరి
మంగళధ్వనులన్నిదిశలన్
మార్మ్రోగెనుమాధవా।
మోక్షదాతా మేలుకో

R

పక్షివాహన మేలుకో ॥సత్యసాయి॥
నగరసంకీర్తనము జేయగ
భక్తులందరు వచ్చినారు
మధురమైన నీదునామము
మత్తునే కలిగింపజేసెను
మధురమూర్తీ మేలుకో—మధు
సూదనా మమ్మేలుకో॥ ॥సత్యసాయి॥
తూర్పుదిక్కున తోయజాప్తుడు,
నేర్పుగా తన కాంతి విసరెను,
బాలభాస్కరు ప్రభలలోన
భక్తులేమైమరచిపోయిరి॥
రామచంద్ర మేలుకో—క్షీ
రాబ్ధిశయన మేలుకో; ॥సత్యసాయి॥
శాంతినిలయముకాంతి లోన
వింతశోభల తోడవెలిగెను
వేదవేద్య మిమ్ముజూడగ
వేచియుండిరి వేలజనము
వారిజాక్షమేలుకో—కరి
వరదశ్రీహరిమేలుకో॥ ॥సత్యసాయి॥
దీనజనులను బ్రోవనెంచి
దివిని విడచి భువిని జేరి
మానవులలో మాధవత్వము
వ్యాప్తి జేయగవచ్చినావో॥
పతితపావన మేలుకో—భవ
బంధమోచన మేలుకో॥ ॥సత్యసాయి॥
జగతికంతకు అమ్మవీవై
జడులగూడ జ్ఞానులుగను
మార్చునట్టి మహిమగలిగిన
మాత ఈశ్వరి సాయి భగవతి
పరమపురుష మేలుకో—బం
గారుబాబా మేలుకో॥ ॥సత్యసాయి॥
బుట్టతలను బయటగలిగియు
బొట్టలోపల పుడమిదాచియు
మానవునిగా మాకు దోచి
మాయ బాపెడు మాధవుడవు
నందివాహన మేలుకో—ఆ
నందమూర్తీ మేలుకో॥ ॥సత్యసాయి॥
మందహాసము చిందులొలికెడు
మీదు మోము మురియ జేయును
ఎర్రవస్త్రములన్ ధరించిన—క
న్నెఱ్ర జేయగ కదలు లోకము
శంకరా శివ మేలుకో—అభ
యంకరా మమ్మేలుకో॥ ॥సత్యసాయి॥
మెత్తనైన నీదుపాదము
చిత్తమందున హత్తుకొనియెను
ఎట్టి కష్టములొచ్చినన్ ఎద
గట్టిగా మిము నమ్మి కొల్తుము
శాంతమూర్తీ మేలుకో—కరు
ణాంతరంగమేలుకో॥
సుందరాంగ మేలుకో—యదు
నందనా మమ్మేలుకో॥ ॥సత్యసాయి॥

—నర్వా నారాయణరావు, వనపర్తి.



# "సాయి సామ్రాజ్యము"

ఈ విధములైన సద్గుణములను, మన సత్యసాయి పాతవిద్యార్థులందరూ సమావేశమై మున్ముందు ఈవిధమైన ఆశయాలను జగత్తునకుచాటి, సమాజమును పవిత్రపరచి తద్వారా భారతదేశకీర్తిని తిరిగి నిలబెట్టుటకు మీరు ప్రయత్నించాలి. సత్యసాయి కళాశాల పాతవిద్యార్థులు "కింగ్‌డమ్ ఆఫ్ సత్యసాయి" అని చక్కని పేరు పెట్టుకున్నారు. "కింగ్‌డమ్ ఆఫ్ సత్యసాయి" అనగా సత్యసాయి రాజ్యము అనిపేరు. 'సత్యసాయిరాజ్యము' అని పేరు పెట్టుకుని సత్యసాయికి సంబంధించిన ఆశయాలను ఈ రాజ్యమునందు ప్రచారప్రబోధలు చేయకున్న ఈ "సత్యసాయిరాజ్యము" అన్నది కేవలము ఒక విధమైన అలంకారనామముగా నిరూపించవచ్చును. కనుక పేరు సార్థకం కావాలంటే ప్రవర్తన కూడా సార్థకమైనదిగా ఉండాలి. 'త్యాగరాజు' ఎంత చక్కనిపేరు. త్యాగములో అతను రాజట. ఆ పేరుకు తగినట్లుగా ప్రవర్తించాడు త్యాగరాజు. మహారాజు వజ్రవైడూర్యమరకతమాణిక్యగోమేధికపుష్యరాగములతో చేసిన సిరిసంపదనంతా పంపినప్పుడు 'నిధి చాలా సుఖమా? ఈశ్వరసన్నిధి చాలా సుఖమా? నిజముగ దెలుపుమ మనసా' అని, ఆ వచ్చిన సంపదను వెనక్కు త్రిప్పి పంపించాడు. తక్షణమే రాముల చెంతకుపోయి 'రామా! నాహృదయాన్ని డబ్బిచ్చి కొనుక్కోడానికి ప్రయత్నం చేస్తున్నావా? నీకేనాడో అర్పితం గావించుకున్నాను ఈ హృదయము. నీకు అర్పితం గావించుకున్న హృదయాన్ని తిరిగి ఇంకొకరికి తాకట్టు పెట్టడమనేది ఎంతపాపం? ఈ విధమైన త్యాగమునుచేసిన వాడు కనుకనే త్యాగరాజన్నది సార్థకనామమయింది. ఇంకాకొంతమంది పేర్లు ఉంటాయి. 'సౌందర్యరాజు' అని పేరు ఉంటున్నది. ఒక్కొక్క పన్ను ఒక్కొక్కవైపునా ఒక్కొక్క కన్ను ఒక్కొక్కవైపునా ఉంటున్నది. ఇది సార్థకనామమేనా? కనుక ఈ భారతదేశములో అర్థరహితమైన పేర్లతో కాలము వ్యర్థము చేస్తున్నాము.

రామరాజ్యము ఎంతపవిత్రమైనరీతిగా పరిపాలన జరిగిందీ, ఎంతధర్మముగా, ఎంతన్యాయముగా, ఎంత సౌమ్యంగా, ఎంతసన్నిహితమైన ఐకమత్యంగా జరిగిందో మీకందరికీ తెలిసినవిషయమే! పితృవాక్యపరిపాలన నిమిత్తమై, ఇక్ష్వాకులవంశం ఆడిన మాట తప్పదు అనేసార్థకనామమును నిలబెట్టే నిమిత్తమై, తనకు అధికారమున్న రాజ్యమునుకూడ త్యజించి రాముడు అరణ్యానికి వెళ్ళినాడు. రాముడు దురాశకు గురికాలేదు. తన ఆశయాలను జగత్తునకు వ్యాప్తి గావించే లక్ష్యమే రామునిసంకల్పం. కనుకనే 'రామో విగ్రహవాన్ ధర్మః'. రాముడు సాక్షాత్తూ ధర్మస్వరూపుడు అని జగత్తునకు వ్యాప్తిగావించుకున్నాడు. అదేవిధముగానే 'కింగ్‌డమ్ ఆఫ్ సత్యసాయి'కి సార్థకతను మీరు అందించాలనుకున్నప్పుడు సత్యసాయి ఆశయాలను సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస తత్త్వములచేత మీరు జీవించడానికి ప్రయత్నించాలి. జగత్తును వంచించే వేషభాషలకు మీజీవితాన్ని అంకితం గావించకూడదు. కొంతమంది విద్యార్థులలోకూడా కొన్ని అపోహలుగలుగుతుంటాయి. "మేము కళాశాల వదలిపెట్టినతరువాత ఎప్పుడో ఒక పర్యాయము స్వామిదగ్గరకు వెళ్ళినా, స్వామి మమ్ములను చూడటం

లేదే, పలకరించడంలేదే అనే అపోహలకు వారు గురి అవుతుంటారు. నిజముగా సత్యసాయి ఎందుకు పలకరించలేదో, ఎందుకు చూడటంలేదో, కొన్ని సంవత్సరములు బృందావనములో ఉండికూడా విద్యార్థులు గుర్తించలేకపోతున్నారంటే నిజముగా వారిలో సరియైన భావము ఇంకా అభివృద్ధికాలేదు అని అర్థము. సాయికి ఆగ్రహానుగ్రహములు రెండూలేవు. సాయి ఒక పరిశుద్ధమైన అద్దమువంటివాడు. ఆ అద్దమునందు నీవు ఏవిధముగా ప్రవర్తింతువో నీప్రతిబింబముకూడ అదేవిధముగా వర్తిస్తుంది. కనుక నీప్రవర్తనాదోషములే ఈ 'రియాక్షన్'కు అనగా స్వామి ప్రతిధ్వనికి మూలకారణంగా ఉంటున్నది. నీ దోషములే నీకావిధంగా కన్పిస్తున్నాయి. నీతలంపులే నీకావిధంగావినిపిస్తున్నాయి. నీఊహలే నీకు ఆవిధంగా అనిపించుచున్నవి. అంతే కానీ సాయికి ఏవిధమైన అసంతృప్తిగానీ, లేక తృప్తిగానీ లేవు.

అయితే ఒక్కొక్క సమయమునందు వారిని సరిదిద్దేనిమిత్తమై కొన్నిరకములైన మాటలను ప్రవేశపెట్టడము, కొన్నిరకములైన చర్యలను చూపించడము జరుగుతుంటుంది. ఇది చేయకతప్పదు. ఏది నేను చేసినప్పటికినీ, వారి మంచికే, వారి అభివృద్ధికే, వారి ఉన్నతికే. వానిమిత్తమై నేనేమాత్రమూ ఆశించను. ఇన్ని లక్షలు ఖర్చుపెట్టి, ఇన్నివిధములుగా శ్రమించి, ఇంత కళాశాలను స్థాపించినందుకు ఏకొంతమంది విద్యార్థులైనమా ఆశయాలను జగత్తునకు వ్యాప్తిగావించే ప్రయత్నానికి పూనుకుంటారేమోనని ఆశయే నాది. మా కళాశాలావిద్యార్థులను మిగిలిన కళాశాలల విద్యార్థులకు పోల్చిచూచిన మా కళాశాలావిద్యార్థులు ఎన్నో రెట్లు మంచివారు. ఇంకా కొంతమందిని చక్కగా పరీక్షించిచూచిన జీవితమంతాకూడా స్వామికి అంకితం చేసుకుని ఉన్నారు. ఇలాంటి విద్యార్థులు కూడా అధికంగా లేకపోలేదు. పుట్టెడు బియ్యంలో చిట్టెడు మెరికలు చిక్కినట్లుగా ఇంతమంది విద్యార్థులలో ఒకరిద్దరు మాత్రము కొంత పెడమార్గము అవలంబించేవారుకూడ లేకపోలేదు. తెలిసో తెలియకయో పూర్వము ఏవిధమైన ప్రవర్తనలు వారు కల్గియున్నప్పటికినీ, నేటినుండీ 'కింగ్‌డమ్ ఆఫ్ సత్యసాయి'లో ప్రవేశించడంచేత నేటినుండీ అలాంటి తప్పొప్పులకు, అలాంటి పొరపాట్లకు ఎట్టి అవకాశముకూడా లేకుండా సాయి ఆశయాలను జగత్తునకు వ్యాప్తిగావించి పవిత్రమైన భారతదేశములో సార్థకనామాన్ని అందిస్తారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నాప్రసంగాన్ని విరమిస్తున్నాను.

ఇప్పటికే అధికంగా నేను ప్రసంగించాను. నేనీ దినము ప్రసంగించాలని సంకల్పించలేదు. ఈవేదిక మీద కూర్చున్నవారందరుకూడ కొన్నినిమిషాలలోపల 'కింగ్‌డమ్ ఆఫ్ హెవెన్' అనే పవిత్రప్రదర్శనం ఈయడానకు సంసిద్ధముగా ఉన్నారు. కానీ, నేను అధికంగా ప్రసగించడంచేత వారికి మేకప్ చేసుకోడానికి కొంతకాలం అధికంగాలభించుతున్నది. కనుక నేను ఈప్రసంగాన్ని చేయవలసివచ్చింది. కానీ, నాప్రసంగాన్ని విరమించి త్వరలో మా విద్యార్థులు ప్రదర్శించే పవిత్రమై ఆదర్శయుతమైన జీవితాన్ని మీరు కన్నులారా చూచి, కర్ణానందముగావిని, హృదయముతో స్వీకరించి తద్వారా దానిని నిరంతరము స్మరించి, వరించి, తరించి, సార్థకతపొందుతారని నేను నాప్రసంగాన్ని విరమిస్తున్నాను. ఈవిధమైన ప్రదర్శనలు ఏనిమిత్తమై నేను చేస్తున్నాననేది మీరు గుర్తించుకోవాలి. అనేకమందికి అనేక అపోహలు ఉండవచ్చును. నేను చేయించు ఆటలుకానీ, మాటలుకానీ, పాటలుకానీ, నేను చేసే ఆటలుకానీ, పాటలుకానీ, మాటలుకానీ

అన్నీ అంతరార్థములేకుండా ఉండవు. ఏదో ఒక విధంగా మానవుని ఆవరించిన అజ్ఞానమును, దుఃఖమును, అశాంతిని దూరంచేసి పవిత్రమైన బలమును, శక్తిని, సామర్థ్యమును, ప్రశాంతిని అందించేనిమిత్తమై, కొన్ని ప్రదర్శనలద్వారా ఈ ప్రచారము చేయుటకోసం నేను ఈ విధమైన దృశ్యాలను కొంతవరకు నిరూపిస్తూవస్తుంటాను, చూపుతూ వస్తుంటాను. అన్నింటిద్వారా ఏదో ఒక బోధనతప్ప నిరుపయోగమైనది ఏమాత్రమూ నా సంకల్పములో చేరదు.

(కింగ్‌డమ్ ఆఫ్ సత్యసాయి విద్యార్థులకు భగవానుని దివ్య సందేశము.
22-11-79, ప్రశాంతినిలయము.)

# అవతారం అంటే ఏమిటి?

దైవం మానవదేహముతో భూమిపై ఉద్భవించడమే అవతారం. కాలం అంధకారబంధురమై, విజృంభించినపుడు భగవంతుడు మానవరూపమెత్తుతుంటాడు. మానవజాతిని ఉద్ధరించి, నూతనయుగాన్ని వెలయించడమే అవతారలక్ష్యం. ప్రతి అవతారంలో సనాతనమైన సత్యం మూర్తీభవిస్తుంది. సనాతనధర్మముతో నిండిన వేదాంతాన్నే అన్ని అవతారాలు బోధిస్తుంటాయి. సత్యంయొక్క స్వాభావిక లక్షణాలు వివిధ దశల్లో వేర్వేరుగా, వివిధసంస్కృతులకనుగుణంగా వివరించబడ్డాయి. అయితే అన్నింటిలోనూ అంతర్లీనమైన సందేశం ఒక్కటే. డా॥ రాధాకృష్ణగారు చెప్పినట్లు, అవతారోద్దేశము, దైవంయొక్క ఔన్నత్యాన్ని మానవపరిధిలో ఇరికించడంకానీ, మానవప్రవృత్తిని దైవత్వంలో లీనం చేయడంద్వారా భగవంతుని స్థాయిని పెంచడం కానీ కాదు.

సెయింట్ జాన్ ''భగవంతుడికీ, ఆయన అంశతో జన్మించిన అవతారానికీ భేదం లేదని'' వ్రాశారు. ఏసు "నీవు నన్ను తెలుసుకొనగల్గితే, నా తండ్రిని కూడ తెలుసుకొనగలవు''. ''నన్ను కనుగొనగల్గినవాడు నా తండ్రినికూడ చూడగల్గుతాడు'' అని వక్కాణించినట్లు వ్రాశారు.

భగవంతుడు అనాది అనీ రూపరహితుడనీ మనం తలచుతుంటాం. దైవము రూపరహితుడు కాబట్టి, భగవదవతారంలను అర్థరహితము అనికొందరు చెప్పుతూంటారు. అయినప్పటికీ ఆదే పరమాత్మ సర్వవ్యాపి అనీ, సర్వజ్ఞుడనీ, సర్వశక్తిమంతుడనిన్నీ వారునమ్ముతారు. హేతు వాదదృష్టితో ఆలోచిస్తే ఈ లక్షణాలన్నీ మూర్తీభవించిన పరమాత్మకుకూడా ఆపాదించవచ్చు. అలాంటప్పుడు భగవంతుడికిఉన్న మానవరూపంతో సహా ఎట్లాంటి రూపమయినా ఊహించి దాల్చడానికిగల శక్తిని మనం ఎలాకాదనగలం? తదనుగుణంగా దేశకాలమానపరిస్థితులననుసరించి భగవంతుడు తనకవసరమని తోచినపుడు మానవరూపంతో కొన్ని లక్ష్యాలను నెరవేర్చడానికి అవతారం ధరించవచ్చుగదా! దైవం

విశ్వాన్ని సృష్టించి, విశ్వమంతానిండియుండి, విశ్వాన్ని పరిపాలించుతాడని నమ్మినపుడు ఆయనకూడా ఒక మూర్తిత్వంకల్గివుంటాడని నమ్మడంకూడా సహేతుకమే। పరమాత్మ సూత్రమనీ సూత్రధారిఅనీ, సూత్రధారణకి పద్ధతి అనీ అన్నప్పుడు సర్వమూ ఆయనయే కదా। భగవంతుని గురించి మనం చెప్పేది, నమ్మేది, తెలుసుకున్నదీ నగభాగం కావచ్చు లేదా తెలుసుకున్నదంతా వట్టిదే కావచ్చు. ఎందుకనగా పరమాత్మ అంటే ఇదీ అని ఇదమిత్థంగా వివరించడం ఎవరి వల్లా అయ్యే పని కాదు.

భగవంతుడు నరాకారుడు; అలా అని ఆయన నరాకారుడు మాత్రమే కాదు. పైరెండువాక్యాలు నిజమంటే దాంట్లో విచిత్రమేమీలేదు. ఈ వాదనలను నిరీశ్వరవాదుల్లో, నాస్తికులో మాత్రమే వాదనగల్గుతారు. పైరెండువాక్యాలనూ పరస్పరవిరుద్ధంగా తలంచడం మన పరిమితమైన గ్రాహ్యశక్తివల్ల మాత్రమే నిజానికి మనం ఈవాదన అంతర్యములో ఉన్న ఏకత్వాన్ని గమనించలేకపోతున్నాం.

అవతారాలను గుర్తించేపుడు ఆయా అవతారాలు వివిధస్థాయిలకుచెందివుంటాయని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. కొన్ని అవతారాలు సాధకులకు ఆధ్యాత్మిక విషయాలు బోధించడాన్కి గురుత్వం వహించే ఋషులుగానో, సాధువులుగానో దర్శనమిస్తే, మరికొన్ని మానవరూపంలోనే సంపూర్ణభగవత్‌తేజస్సును వెలువరింపచేయవచ్చు. ఆయా అవతారాల గురించి, ఆయాకాలపు ప్రజలు గుర్తించడం, తెలుసుకోవడం, అరుదు. అజ్ఞానులైన ప్రజలకు వారి కళ్లముందు జరుగుతున్నదేమిటో అర్థంచేసుకోవటం కష్టమే. అయితే కొద్ది మంది జ్ఞానులు మాత్రం తాము దర్శిస్తున్న అపూర్వసంఘటనలమూలాన్ని గ్రహించగలుతారు. ఈ తెగ వారు ప్రతిఅవతారకాలంలోనూ ఉంటూంటారు.

శ్రీ హవార్డ్ మర్ఫెట్ భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారిని గురించి వ్రాసిన మొదటి పుస్తకం "సాయి బాబా—మాన్ ఆఫ్ మిరకిల్స్" (అమృతమూర్తి—అనువాదం— శ్రీ అమరేంద్ర) లో స్వామిలో తానేమి చూశారో, ఏమి నేర్చుకో గల్గేరో వ్రాశారు. శ్రీ మర్ఫెట్ తన రెండవ పుస్తకం "సాయిబాబా—అవతార్"లో స్వామి అవతారదివ్యకార్యక్రమంగూర్చి, అవతారలక్ష్యం గురించి మరింత వివరంగా వ్రాశారు. పుస్తకప్రమురణకర్తలు, "శ్రీ మర్ఫెట్ స్వామి కల్కి-అవతారమని నిస్సంశయముగా నమ్ముతున్నారు. కలియుగలక్షణాలయిన దుర్నడతలూ, దుర్వ్యాపారాలు ఎక్కడ చూచినా తలెత్తి, భగవంతుడు స్వయంగా మానవరూపం దాల్చి తనకార్యక్రమం చేపట్టితే తప్ప మెరుగుపడని పరిస్థితికి వచ్చినట్లు ప్రస్ఫుటమయినందున ఈ కల్కి అవతారం వచ్చిందనికూడా ఆయన గాఢమైన నమ్మకం," అని వ్రాశారు.

మున్నెన్నడు లేనంతగా, దైవం అవతారం దాల్చవలసిన అవసరం ఈ నాడు కల్గింది. మానవజాతి యావత్తూనాశన మయ్యేకాలం ఆసన్నమయిందా అన్పించేస్థితి ప్రస్తుతం కన్పడుతోంది. శ్రీ మర్ఫెట్ జ్ఞానులు, పండితులూ, శాస్త్రవేత్తలూ సాటిలేని విజ్ఞానమేధానంపత్తికలవారు. అట్లాంటివారి నమ్మకాలను, వారు ప్రకటించే అనుభవాలను అలక్ష్యం చేయటం కానీ సంశయించి కొట్టివేయటం కానీ భావ్యం కాదు. వారంతా శ్రీ సత్యసాయిబాబా వారు పూర్ణ తేజంతోకూడిన దైవశక్తి అనీ, అవతారం అనీ అంగీకరించి బోధిస్తున్నారు.

శ్రీ మర్ఫేట్‌ను, ఒకరు "స్వామి తమ ఆధ్యా ప్రబోధలద్వారా వ్యక్తులను ప్రభావితం చేసి ప్రస్తుత పరిస్థితిని చక్కబెట్టగలరా?" అని ప్రశ్నించారు. అంతే కాక, "ఆ మార్పు మొత్తం మానవజాతిని ఆధ్యాత్మిక పంథాలోనికి పయనింపచేయగలదా?" అని కూడా అడి గారట. దానికి శ్రీ మర్ఫేట్ దృఢవిశ్వాసంతో "అవ తారానికి తన కార్యాన్ని విజయవంతముగా నెరవే ర్చడం స్వాభావికమని" జవాబిచ్చారు.

(సైకిక్ న్యూస్ పత్రికలోని పుస్తకపరిచయ లేఖ).

—డబ్ల్యూ. ఎం. మ్యాకిన్‌టాష్

# బాబా చెప్పిన పాఠం

1976 సం॥ ఏప్రిల్ 15 వతేదీ. ఆనాడు పవిత్ర గురువారం. మన్‌హాటన్‌లోని ఆమ్‌స్టర్‌డాం ఎవెన్యూ, 103 వ స్ట్రీట్‌లో ఉన్న సెంట్‌జాన్ పవిత్రచర్చికి నేను వెళ్లాను. అక్కడ శ్రీమతి హిల్డాచార్ల్‌టన్ గురించి విన్నాను. ఆమె భారతదేశంలోనూ, దూరప్రాచ్యం లోనూ చాలా యేళ్లు గడిపింది. చాలకాలం అక్కడి గురువులను, దివ్యపురుషులనూ దర్శించటంలో వెచ్చిం చింది. ఆమె ఎన్నోసార్లు ఒకవిషయాన్ని గురించి ముచ్చటించిందని విన్నాను. అదేమిటంటే—భారత దేశంలోని దివ్యపురుషుల్లో ఒక రైన సాయిబాబా సృష్టించి యిచ్చిన దివ్యవిభూతి ఆమెవద్ద ఉన్నదట. కడచిన నెలరోజులుగా చాలమంది ఆవిభూతిని గురించి నాతో ప్రస్తావించారు. ఏదివ్యపదార్థమైనా, డబ్బు పెట్టి కొనుక్కునేదికాకపోతే, విలువైనదనే నా అభి ప్రాయం. అందువల్ల దాన్ని నేనుకూడా కొంతపొం దటానికి ప్రయత్నించటం మంచి దనుకున్నాను. హిల్డాను కలిసికొన్నాను. ఆమె విభూతి పొట్లం ఇస్తూ 'దీన్ని తిలకంలా ధరించండి: మీకెంతో మేలు చేస్తుంది' అని చెప్పింది. ఆమెకు కృతజ్ఞతలు చెప్పి వచ్చేశాను.

ఆనాటి సాయంకాలం విభూతి పొట్లాన్ని విప్పాను. కొంతవిభూతిని అరచేతుల్లో వేసికొన్నాను. కాస్త చప్పరించి ఏ మౌతుందా అని వేచి చూచాను. నా ఎడమ అరచేయి వింతగా వెచ్చబడింది. కుడి అర చేయి మాత్రం మామూలుగానే ఉంది. నాకు ఆశ్చర్యం వేసింది.

రోజులూ వారాలూ గడచేకొద్దీ ఆ వింతప్రభావం నా మీద క్రమంగా పనిచేయటం మొదలు పెట్టింది. నేననుకోకుండానే తరచుగా నా ఎడమ అరచేయి వెచ్చగా కావటం అనుభవించేవాణ్ణి. చర్చిలో ప్రవేశిస్తున్న ప్పుడూ, పవిత్రస్థలాలను దర్శిస్తున్నప్పుడూ ఆధ్యా త్మిక, మతవిషయాలను చర్చిస్తున్నప్పుడూ, క్రీస్తువిగ్ర హాలనూ చిత్రాలనూ చూస్తున్నప్పుడూ ఆ అనుభవం మొదట్లో కలుగుతుండేది. ఆ తరువాత మూడువారాలు గడిచేసరికి ప్రతిరోజూ ఎన్నోసార్లు అరచేయి వేడె

ర్కేది. నేను భోజనం చేస్తున్నప్పుడూ, టెలివిజన్ చూస్తున్నప్పుడూ, దైనందినిక కార్యకలాపాల్లో మునిగితేలుతున్నప్పుడూ, అప్పుడూ ఇప్పుడూ అని లేకుండా, ముందుసూచనకూడా ఏదీలేకుండా ఆ అనుభవం కలుగుతుండేది. పదివేలమైళ్లదూరంలో ఉన్న ఒక దివ్యపురుషుడు సృష్టించినవిభూతి నన్ను స్పృశించి ప్రభావితం చేస్తున్న ఆ నిరంతరస్మృతి నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది.

ఎవరా మహానుభావుడు?

అంతదూరానఉండి ఇంతగా నన్నుప్రభావితం చేసిన ఆవ్యక్తినిగురించి తెలియచెప్పే పుస్తకాలను చదవాలని నిశ్చయించుకొన్నాను. డా॥ శామ్యూల్ శాన్డ్విస్ యం. డి., రచించిన "ది హోలీ మాన్ అండ్ ది సైకియాట్రిస్ట్" అన్న గ్రంథాన్ని కొన్నాను. దాన్ని చదువుతున్నప్పుడు నా జీవచైతన్యమే మొదలంట కదిలి ఒక నవ్యతేజాన్ని పొందినట్లైంది.

'క్రీస్తును తలపించేలా అధికారికంగా మాట్లాడుతూ, మనుషులమధ్య నడయాడుతూ, జీవిస్తూన్న ఒక మహావ్యక్తి ఇదుగో ఇక్కడ ఉన్నా' డని నామనస్సు ఆనందంతో లాస్యంచేసింది. ఆయన భగవంతుని దివ్యప్రేమసిద్ధాంతాన్ని ప్రబోధిస్తున్నారు; 'మానవ సేవయే మాధవసేవ' యని ప్రపంచిస్తున్నారు. అంతేకాదు, ఎవరినుండీ ఎటువంటి కానుకలూ పుచ్చుకోవటంలేదు. నానావిధ అద్భుతమహిమలను అనన్యసాధ్యంగా ప్రదర్శిస్తూ, 'నేను భగవంతుని అవతారమూర్తి'నని దివ్యసందేశాలనందిస్తూ, భగవత్తత్వాన్ని ప్రతిపాదిస్తున్నారు. అంతేకాదు—ఆయన ఆహారాన్ని అనంతముగా సృష్టిస్తున్నారు, రోగులకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నారు; చివరకు చనిపోయిన వారినికూడా బ్రతికిస్తున్నారు.

ఈ అద్భుతాలన్నీ తెలిసికొని నేను కలవరపడ్డాను, కొంత భయాందోళన చెందాను. కాని, వెనువెంటనే ఆధ్యాత్మికసముద్ధరణను కలిగించే ఒక ఉత్తేజం నాకు లభించింది. వేదనపడే నా అంతరాత్మకు అది అమృతపానంలా అనిపించింది. ఇంకా ఆయనను గురించి చదవాలి, ఎన్నో విశేషాలు తెలిసికోవాలి అని హృదయం వేగిరపడింది. ఇంతవరకూ శ్రీ సాయిబాబాను గురించి నేను చదివిన అంశాలన్నీ సత్యాలయితే, జీసెస్ క్రీస్తు తరువాత ఇంతటి మహానుభావుడు భూతలంమీద పుట్టలేదని నిస్సంశయంగా చెప్పవచ్చునని నా అంతరాత్మ ధ్వనించింది.

ఆ తరువాత 'మాన్ ఆఫ్ మిరకిల్స్' అనే పుస్తకం నాకొక మిత్రుడు శుభాకాంక్షలతో అందించాడు. ఆ గ్రంథకర్తయైన హవార్డ్ మర్ఫెట్ సాయిబాబా సన్నిధానంలో ఎన్నో ఏళ్లు గడిపిన పాత్రికేయుడు. ఆ గ్రంథములో చెప్పబడిన అపూర్వ అద్భుత చర్యలు బాబా భగవల్లీలలను ధ్రువపరుస్తున్నాయి. అయినా, ఈ మహావ్యక్తిని గురించి చాలమంది అమెరికన్లకు ఇంకా తెలియదు. ఎందువల్ల? ఈ ప్రశ్న నామనస్సులో బాగా గుచ్చుకొన్నది. ఆ తరువాత మరే పుస్తకాలూ చదవలేదు. ఒకటి తరువాత మరొకటి నాజీవితంలో వింత సన్నివేశాలు క్రమంగా జరగటం మొదలుపెట్టాయి. తరచుగా ఆ మహావ్యక్తి నన్ను ప్రభావితుణ్ణిచేసి, ముందుకు లాక్కొని వెళుతున్నట్లుగా అనుభవాన్ని పొందుతుండేవాణ్ణి. ఆసమయంలోనే నా స్నేహితుడొకడు సాయిబాబా ప్రభావంలో, మరీ మునిగిపోకుండా గ్రాడ్యుయేట్ డిగ్రీకోసం కళాశాలలోచేరి చదవటం మంచిదని సూచించాడు. నేను హోప్కిన్స్ విశ్వవిద్యాలయంలో చేరి, 'శాయ్‌చీ', తదను బంధతత్త్వం' అనేఅంశంమీద కృషి చేయటం ప్రారంభించాను.

ఒకనాటి తెల్లవారుజామున నాకొక ఉజ్జ్వలమైన కల వచ్చింది. ఆ కలలో ఒక పుస్తకం పేరు, అట్టడి జైనుతోసహా స్పష్టంగా కనపడింది. దాని పేరు "Sai Baba: Contemporary Mystic, Master and God." అప్పుడు నాకొక స్ఫూర్తి కలిగింది. "నేనంతవరకూ చదువుతున్నదీ, వ్రాయాలని మనసులో నిజంగా కోరికపడుతున్నదీ"—అదే అంశం. నేను ఆ అంశంమీద ఎందుకు వ్రాయకూడదు? ...అవును .... 'సమకాలీనమార్మికవాదం—మీద సాయిబాబానుగురించి ఎందుకు వ్రాయకూడదు?' అని అనిపించింది. వెంటనే విశ్వవిద్యాలయం వారిచేత ఆ అంశాన్ని ఒప్పింపజేశాను.

ఆ తరువాత మరో సమస్య ఎదురైంది. ప్రత్యక్ష అనుభవం లేకుండా, పుస్తకాలమీదనే ఆధారపడి నేనా బాబాగారినిగురించి ఎల్లావ్రాసి నా పరిశోధన ప్రణాళికలను రూపొందించగలను?—అన్న అనుమానం కలిగింది. అప్పుడు ఇలా నిర్ణయించుకొన్నాను. 'నేనా స్వామిని ప్రత్యక్షంగా దర్శించి, ఆ దివ్యమహిమలను స్వయంగా చూచి నిశ్చయించుకొని బాబానుగురించి గ్రంథం వ్రాయాలి. ఒక వేళ నేను వారివద్దకు వెళ్లి చూచిన తరువాత వారుబూటకంగా అనిపిస్తే....? అయినా సరే; వారి బ్రహ్మాండమైన మోసాన్నంతా బట్టబయలు చేస్తూకూడా నేనొక సిద్ధాంతవ్యాసం వ్రాయవచ్చు. అదికూడా మంచిదే. అయితే, ముందు నేను భారతదేశం ఎలావెళ్లేది? నా దగ్గఱ చిల్లిగవ్వకూడా లేదు.' ఇలా అనుకుంటూ సాయిబాబా పటంవైపు తిరిగాను. ఆయనను ఇలా ప్రార్థించాను—"స్వామీ! మీరు నాచేత నిజంగా ఈ గ్రంథాన్ని వ్రాయించాలని సంకల్పించి ఉంటే, నేను భారతదేశానికి వెళ్లడానికి తగినంత ధనం చేకూర్చి పెట్టాలి. ఎందుకంటే, ప్రస్తుతం నేను ఆర్థికంగా బాగా చితికిపోయి ఉన్నాను.

ఇదిజరిగిన 48 గంటల్లో 'న్యూయార్కు' నగరం నుండి టపాలో వెయ్యి డాలర్ల చెక్కొకటి నాకు వచ్చింది. ఆమొత్తం చాలకాలంగా వసూలు కాకుండా వాయిదాలు పడుతున్న బకాయితాలుకుది. అప్పుడను కోకుండా నాచేతికందింది. ఆపైకం నాకందటానికి సాయిబాబా కారకులా అన్నది నిజమైన ప్రశ్న కాదిప్పుడు. కావి ఆశలు వదలుకొన్న మొత్తం బాబాగారిని ప్రార్థించిన మర్నాడే అందటంలో నేను ఆశ్చర్యచకితుణ్ణయ్యాను. ఆమొత్తంకూడా నేను భారతదేశానికి చేరటానికిమాత్రం సరిగ్గా సరిపోయేదికావటం మరో విశేషం. బాబా నాభవిష్యత్తును రూపొందిస్తున్నారనటానికీ, వారు నన్ను తమవద్దకు రప్పించుకొంటున్నారనటానికీ ఈఘటన ప్రత్యక్షనిదర్శనం. నేను సాధ్యమైనంతవరకు నిర్మమత్వంతో అక్కడికి వెళ్లాలనీ, చిత్తశుద్ధితో విషయాలను సేకరించాలనీ నిశ్చయించుకొన్నాను. రాబోయే క్రిస్టమస్‌సెలవుల్లో, క్లాసులు తీసుకొనే బాధ్యత ఉండదుకాబట్టి, రెండునెలలపాటు బాబా దగ్గరగడపాలని నిర్ణయించుకొన్నాను.

ఈ సందర్భంలో రెండు విషయాలుమాత్రం స్పష్టంగా మనస్సులో ఉంచుకోవాలి. 1. నేను క్రైస్తవమతంలో గాఢవిశ్వాసాన్ని కలవాణ్ణి. అందువల్ల నేనే ఆచార్యుణ్ణిగాని, గురువునుగాని, విద్వాంసుణ్ణిగాని, సంస్థనుగాని ఆశ్రయించే ఆలోచనే నాకు లేదు. నా చదువువల్లా, నా జీవితానుభవాలవల్లా మానవాళికి లభించిన అత్యుత్తమాచార్యుడు జీసస్‌క్రీస్తనీ, ఆయనయే ఆకృతితాల్చిన దయాస్వరూపుడనీ గాఢంగా విశ్వసిస్తున్నవాణ్ణి నేను. 2) ఈ ఆచార్యుడు (సాయిబాబా) నా వివిధఅనుభవాలద్వారా నన్ను గుర్తించి, నన్ను తనవద్దకు రమ్మని పిలుస్తున్నాడు. అదీ నన్ను ఆశ్చర్యపరుస్తున్న అంశం. నిజానికి, నా సిద్ధాంత గ్రంథరచనకై ఇంత డబ్బు ఖర్చుపెట్టుకొని వారి

దగ్గరికి పోవటమనేది బయటికి కనపడే ఒక సాకు మాత్రమే. నిజమైనకారణం నేను వ్రాయబోయే సిద్ధాం గ్రంథరచనం కంటె లోతైనది మరొకటి ఉంది. 'ఇటువంటి మహావ్యక్తి ఒకరు ఉన్నారంటే వారిని చూడాలి, వారి తత్త్వాన్నీ మహిమనూ నేను అనుభవించాలి. అలాఅయిన నాడు నా ఆత్మాభ్యున్నతికీ, జ్ఞానవిజ్ఞానమార్గంలో పురోగతికీ ఎంతోదోహదం కలుగుతుంది'—అన్నది, నానిగూఢమైన అన్వేషణ; తపన.

నేను భారతదేశానికి బయలుదేరటానికి ముందే సాయిబాబాకు ఒక లేఖ వ్రాశాను. అందులో వారిని ఎన్నో ప్రశ్నలు వేశాను. అందులో ఒక ప్రశ్న బైబిల్ పెట్టే ప్రత్యక్షపరీక్షకు సంబంధించింది. "ప్రతి జీవినీ పరీక్షించు, జీసస్‌క్రీస్ట్ ఎవరని ప్రశ్నించు, జీసస్‌క్రీస్ట్ దేవునికుమారుడని చెప్పిన జీవి ఉత్తమజీవి యని గుర్తించు'' అని బైబిల్‌లో చెప్పబడి ఉంది. జీసస్‌క్రీస్ట్ ఎవరని మీరంటారు' అని ప్రశ్నించాను.

* * * *

1976 సం॥ డిసెంబరు 18 వ తేదీ. ఆనాడు శ్రీసాయిబాబాను నా కన్నులతో ప్రత్యక్షంగా చూడగలిగాను. మరునాటినుండి బాబా సాయంకాల దర్శనం, తరువాత, కొంతమంది పాశ్చాత్యులకూ, భారతీయులకూ, రాత్రివేళల్లో తమ దివ్యనివాసంలో సన్నిధానం ప్రసాదించారు. డిసెంబరు 24వతేదీ క్రిస్టమస్ పండుగ సాయంకాలమునందు బాబా నన్ను జీసస్‌క్రీస్తునుగురించి మాట్లాడమని ఆదేశించారు. నేనా సాయంకాలం ఉపన్యసించాను. ఆరాత్రినుంచి నామనో మందిరంలో క్రీస్తుజీవితానికి సంబంధించిన ఎన్నో చిత్రాలు సజీవపట్టాలుగా దర్శనమిచ్చి నన్ను ఆనంద తన్మయుణ్ణిచేయటం ప్రారంభించాయి. ఈ అద్భుత దర్శనానుభవం దాదాపొక నెలరోజులపాటు ఎడతెరిపి లేకుండాసాగింది. ఆ తరువాత కొంత శాంతించింది. ఈ అనుభవంద్వారా నేనెన్నో విషయాలను అవగాహనంచేసికో గలిగాను. 1) సాయిబాబా నాలేఖలోని ప్రశ్నకు సమాధానంగా నాచేతనే క్రీస్తు వధువనీ, భగవంతుడనీ చెప్పించారు. 2) బాబా నన్ను క్రీస్తుమీద ఉపన్యసించుమని అడగటానికీ, నాకు క్రీస్తుదర్శనం వారి దయతో కలగటానికీ అవినాభావసంబంధం ఉంది. "నీవు నావైపు ఒక అడుగు ముందుకురా. నేను పదిఅడుగులు నీవైపు వస్తాను'' అని బాబా అంటారు. వారు, నన్ను వారికీ, వారిఅనుయాయులకూ క్రీస్తును పరిచయంచేయుమని అడిగారు. కాని, నేనడిగినదానికంటె పదిరెట్లు కుమించినట్లుగా నాకే క్రీస్తును వారు పరిచయంచేశారు. 3) క్రైస్తవ మతంలో జీసస్‌క్రీస్తు దర్శనం కావటం అత్యుత్తమవరంగా పరిగణింపబడుతుంది. 4) జీసస్ నాఆరాధ్య దైవమనీ, నేనాభగవంతుణ్ణి చేరటానికి చేయూతనిచ్చి తీసికొని వెళ్లే దివ్యాచార్యుడు బాబా అనీ, సాయిబాబాయే నాకు ధ్రువంగా నిరూపించారు. 5) క్రీస్తు ఇలా అన్నాడు, "మానవుల ఎదుట నన్ను నీవు గుర్తిస్తే, స్వర్గంలో నా తండ్రి ఎదుట నిన్ను నేను గుర్తిస్తాను". క్రీస్తు జీవితాన్ని గురించి, ఆయన తత్త్వాన్ని గురించి, ఆయన జీవిత ధ్యేయాన్ని గురించి వేలాది భక్తులు కూర్చున్న సభలో వివరించే గౌరవాన్ని బాబాయే స్వయంగా నాకు కల్పించారు.

బాబా అంతమహదవకాశాన్ని అమూల్యమైన కానుకగా నాకందించటానికి నాకు తగినంత యోగ్యతలేదని నాకు తెలుసు. నిజానికి అప్పుడే తెలిసికొన్నాను. భగవంతుని దయఅంటే ఏమిటో! నీకు యోగ్యతలేకపోయినా భగవంతుడు నిన్ను ఆశీర్వదించటమో, కానుక ఇవ్వటమో జరిగితే అదే భగవంతునిదయ. ఇది ఒక దివ్యోపదేశం. లోకంలో యోగ్యులు కాని

వారికికూడా ప్రేమభావంతో మంచి చేయాలని యత్నించటంవల్ల ప్రతివాడూ ఆత్మాభ్యున్నతిని సాధింపవచ్చు. నీ వలా చేయగలిగితే నీవు దివ్యమార్గంలో పయనిస్తున్నట్లే. అందుకే బాబా అంటారు—"ప్రేమ అంటే ఇవ్వటం; క్షమించటం'', అని.

మరునాడు క్రిస్టమస్‌పండుగ. ఆనాడు ఆపండుగను దివ్యంగా, పవిత్రంగా నేననుభవించినట్లు ఎన్నడూ అనుభవించలేదు. ఆనాడు సుప్రభాతంలో ప్రక్కనున్న గ్రామంలో నగరసంకీర్తనం చేస్తూ నన్ను క్రైస్తవ గీతాలనూ, భారతీయభజనలనూ పాడుమని బాబా నిర్దేశించారు. నగరసంకీర్తనంలో పవిత్రదివ్యగీతాలను పాడుకుంటూ అందరం బాబాగారి మందిరం దగ్గరకు వచ్చి సామూహికగానం చేస్తూఉన్నాం. ఆరోజు మందిరం పైభాగంనుండి చేయిఊపుతూ బాబా దర్శన మిచ్చిన ఆదృశ్యాన్ని నేనెన్నడూమరిచిపోలేను. విశ్వద్వి విశీధిగానాన్ని సూర్యరశ్మి తనలో లీనంచేసికొంటున్నట్లుగా, మాపాటల్లోని మాధుర్యాన్నీ, ఆదివ్యజపం చేసే ప్రేమభక్తిభావాన్నీ భగవాన్ తనలో ఐక్యంచేసికొంటున్నట్లనిపించింది.

ఆ తరువాత ఆ రోజు బాబా క్రిస్టమస్ దివ్యోపన్యాస మిచ్చారు. దాదాపు 20వేల మంది ఆ ఉపన్యాసాన్ని వినటానికి సమావేశమయ్యారు. బాబా బయటకు వచ్చినపుడు శ్రీకృష్ణుడులాగా నీలమేఘశ్యాముడై తోచారు. వారువడివడిగామాప్రక్కనుండే నడిచివెళ్లారు. వారు నావైపుకూడాచూడలేదు. కాని, నన్నుసమీపించి నప్పుడు వారి దివ్యవిభూతిసుగంధం నన్ను ముంచెత్తి వేసింది. నేను నాప్రక్కనున్న ఒక్క స్నేహితునితో ఇలా అన్నాను—"ఈ విభూతి ఎంత అసాధారణమైన అద్భుత వాసనవెదజల్లుతోంది" అని. నాస్నేహితుడు, ఆచుట్టుప్రక్కల ఉన్నవారు అందరూ అటువంటి విభూతి వాసన ఏమీరాలేదనిచెప్పారు. నాకు ఆశ్చర్యం వేసింది. అప్పుడు నాస్నేహితుడన్నాడు—"అది స్వామి నీకిచ్చిన దివ్యబహుమానం'' అని. అది నిజంగా మరువలేని మరోదివ్యానుభూతి నాకు. బైబిల్‌లోని ఒక భాగం నాకు చప్పున స్ఫురణకు తగిలింది. 'ప్రపంచంలోని అన్ని గ్రంథాలను కలిపినా జీసస్‌క్రీస్తు మహిమలను వర్ణించటానికి సరిపోవు'' అని బైబిల్ చెపుతుంది. అది అలా ఎందుకు చెప్పబడిందో నాకప్పుడు అర్థమయింది. అవతారపురుషుడు అనుగ్రహిస్తే అది నిస్సందేహంగా భక్తునికి ఆత్మీయమైన అనుభవ మౌతుందే కాని, బాహిరంగా నిరూపించటానికి సాధ్యం కాదు. ఆ అనుభవం నన్ను నమ్మింపకలిగింది కాని, నా ప్రక్కన ఉన్న హేతువాదిని నమ్మించలేదుకదా! ఆ తరువాత బాబావలన వ్యక్తిగతంగా అనుభవాలను పొందిన భక్తులు చెప్పిన విశేషాలెన్నోవిన్నాను. ఆ మహిమలన్నీ ఆయావ్యక్తులపట్ల వారు ప్రసరించిన దివ్య కరుణామయత్వానికి సజీవనిదర్శనాలు. కాని, అందరూ వాటిని భాగం పంచుకోలేరు. అటువంటి అనుభవాలు లెక్కపెట్టలేనన్ని ఉన్నాయి. అన్నింటినీ అందరూ అందరికి చెప్పియుండకపోవచ్చు; అన్నీ అక్షరబద్ధం కాకపోయిఉండవచ్చు.

సాయిబాబా తమక్రిస్టమస్ దివ్యోపన్యాసంలో ఇలా అన్నారు: "క్రీస్తు దివ్యావతారపురుషుడు కాబట్టి, ఆయన పుట్టిన రోజును పండుగగా జరుపుకోవటం న్యాయం.... జీసస్ భగవంతుని దూత, భగవంతుని పుత్రుడు, ఆయనయే భగవంతుడు.'' ''క్రీస్తు పుట్టినరోజున సమావేశాలు జరిపి, విందులుచేసికొని, మద్యపానం సేవించి వేడుకలు చేసికోవటం ఆ పవిత్రపర్వదినాన్ని సక్రమంగా జరుపుకొనేపద్ధతి కాదు. క్రీస్తు చెప్పిన ప్రబోధాల్లో కనీసం ఒకదాన్నైనా ఆ రోజునుండి జీవితంలో ఆచరణంలో పెట్టేప్రయత్నంచేయటమే నిజంగా

ఆపండుగను జరుపుకోవటం.'' ఈ మాటలవలన మాకు క్రిస్టమస్ సక్రమంగాజరుపుకొనే పద్ధతితెలిసింది. బాబా ఉపన్యాసం విన్నతరువాత నాఉత్తరంలో ప్రశ్నలకన్నింటికీ తిరుగులేని జవాబులు నాకు అందాయి. బైబిల్‌లో చెప్పిన విధానాన్నిబట్టి బాబా ఒక 'దివ్యాత్మస్వరూపు'డని చెప్పాలి.

సత్పురుషులను, అసత్పురుషులను వివేచించే విధానాన్ని జీసస్‌యిలాచెప్పాడు—"వారు నీకందించే అనుభవఫలాలను బట్టియే వారిని నీవు తెలిసికోగలవు — — ఒక మంచి చెట్టు మంచిఫలాన్నే ఇస్తుంది; విషవృక్షం విషఫలాన్నే ఇస్తుంది. మంచిచెట్టు విషఫలాన్నీ, విషవృక్షం మధుర ఫలాన్నీ ఇవ్వలేవు - - - అందువల్ల ఫలాన్నిపట్టియే వారివారి యోగ్యతలను తెలిసికోవాలి", అని సాయిబాబా వలన నేను పొందే అనుభవఫలాలను బేరీజు వేసికొన్నాను. మొట్టమొదట వారు నామీద వేసిన ప్రభావముద్రను గణించుకొన్నాను. సిన్నం దేహంగా, బాబా నన్ను భగవంతుని వద్దకు తీసుకొని వెళ్లారు. నా నిత్యజీవితంలో భగవత్సాన్నిధ్యాన్ని భౌతికంగా అనుభవించే ప్రవృత్తిని నాలో జాగృతంచేశారు. దివ్యప్రేమను నాకు చవిచూపారు. "మంచినిచూడు; మంచిని ఆచరించు; మంచిగాప్రవర్తించు'' అని ఆదేశించారు. వారు ఇతరులమీద వేసిన ప్రభావాలను పరిశీలించినప్పుడు—వారి మహిమచేత ఆరోగ్యాలను పొందిన రోగులు, వారిచేత స్థాపింపబడిన విద్యాకేంద్రాలు, సంఘసేవావాలంటీర్ల సంస్థలు సజీవోదాహరణాలుగా గోచరించాయి. వీనినన్నింటినీ మించినవి— వారిని దర్శింపవచ్చిన ప్రజలలో వారు వెలిగించే ఆస్తిక విశ్వాసం, వారి హృదయాలలో నింపే దివ్యప్రేమామృతం. ఆయన ఒక కల్పవృక్షం! దివ్యఫలాలనందించే దేవతావృక్షం !! అందువల్ల—నేను సాయిబాబాను భగవంతుని దూతగా, నాదివ్యాచార్యునిగా అంగీకరిస్తున్నాను.

సాయిబాబా మహిమలను గూర్చి విన్నతరువాత, కొంతమంది ఆయన క్రైస్తవమత విరోధి అని అపోహపడవచ్చు. నాకూ మొదట అలాగే అనిపించింది. కాని, నేను వారిలో మంచితనాన్ని, దయను, ప్రేమను చూడగలిగాను. బాబాగారి ముఖము నుండి ఎల్లప్పుడూ మూడుసందేశాలు వినేవాణ్ణి.

అవి— 1. దేవుణ్ణి ప్రేమించు.

2. ఆ ప్రేమను నీసాటిమానవులకు నిస్వార్థసేవగా అందించు.

3. భగవంతుణ్ణి అంతరాత్మగా దర్శించు. అదియే సర్వజీవులలో ఉండేచైతన్యమని గుర్తించు.

నేనుబాబాసన్నిధానంలో రెండునెలలున్నాను.ఆయనను ప్రతినిత్యమూ దర్శించాను; పరిశీలించాను. దర్శించటానికి వచ్చిన వేలాది భక్తులపట్ల అపారమైన ఆప్యాయత వారుచూపించేవారు; ఎన్నోవస్తువులను సృష్టించి కానుకలుగా భక్తులకు ప్రసాదిస్తుండేవారు; ఎన్నోవిధాలైన రోగాలతో బాధపడే దీనులకు ఆరోగ్యాన్ని చేకూరుస్తూండేవారు. ప్రతిరోజూ బాబా నాకొక క్రొత్తపాఠాన్ని చెప్పారు. బాబాబోధలన్నీ నాకు హితాన్ని చేకూర్చాయి; వారి చర్యలన్నీ నాకెంతో లాభపడ్డాయి. వారినిగురించి సిద్ధాంతవ్యాసం వ్రాయటానికి వారు నన్ను అనుమతించారు; నే నావనే చేస్తున్నా నిప్పుడు. బాబా దగ్గర రహస్యమేమీ లేదు. వారి కార్యకలాపాలన్నీ తెరచియుంచబడిన పుస్తకంలాగా అందరూ చూడటానికి పరిశీలించటానికీ, తమతమ అభిప్రాయాలను సమకూర్చుకోవటానికీ వీలుగా ఉన్నాయి. "నా జీవితమే నా సందేశం'' అనిబాబా తరచుగా అంటుంటారు. వారి దివ్యసందేశం నాకు మరీమరీ వివిపించాలని వారిని నేను మనసారా ప్రార్థిస్తున్నాను.

లారెన్స్ గాలంటి.

# ఎనలేని ఆత్మ సంతృప్తి

మొదట, మైసూరుస్టేటులోని నార్తుకెనరా జిల్లా కుంట కెనరాకళాశాల, తిరుపతి ఆంధ్రపశువుల కళాశాల బాపట్లవ్యవసాయ కళాశాల, తిరుపతి శ్రీ వేంకటేశ్వర వ్యవసాయ కళాశాల, నెల్లూరు డి. కె. ప్రభుత్వ మహిళాకళాశాల మొదలగు కళాశాలలయందు అధ్యాపక వృత్తిని చేపట్టి పనిచేయుట ఒక ఎత్తు, అనంతపురం మహిళాకళాశాలలో పనిచేయుట ఒకఎత్తుగా పరిగణింప బడుతూన్నది. ''తంతే బూరెల బుట్టలో పడ్డట్లు'' పడవలసినచోటు పడినట్లు అనిపిస్తూంది, అనంతపురం ఈ మహిళాకళాశాలలో అధ్యాపకవృత్తిని చేపట్టడం. ఇదే చివరిమజిలీ అనుకుంటా। భుక్తికొఱకు ఈ కళా శాలలో నేను అధ్యాపకురాలుగా చేరినప్పటికి, ఇక్కడ అనుభవం దేనికీ సాటిరాదు.

ఎనలేని ఆనందం, ఆత్మసంతృప్తి ఈకళాశాలలోనే లభిస్తాయి. ఇక్కడి ప్రత్యేకత అదే। నిద్రలేచింది మొదలు మరల నిద్రకి ఉపక్రమించే వరకు ప్రాపంచిక విషయాలలో కొట్టుమిట్టాడే ఈ జీవికి కళాశాలలో అడుగిడగానే అదో ప్రశాంతి. ప్రతిపనిలో కూడ చెప్పలేని హాయి. ఇంకా, ఇంకా చేయాలి అన్న తపన. స్వామికి ప్రత్యక్షంగ సేవ చేయ నోచుకోలేని అభాగినికి పరోక్షంగా స్వామి సంస్థలో సేవచేసేందుకు అవకాశందొరికిన భాగ్యానికి చేతనైనంత పాటుపడుటయే కావలసింది.

ఈ కళాశాల 1968లో నెలకొల్పబడి ఎన్నో ఘన కార్యాలను నిర్వహించింది. డిగ్రీ తరగతులలో 'సెమిస్టర్ సిస్టమ్' ప్రవేశపెట్టబడినది. ఈ పద్ధతిని ప్రవేశ పెట్టిన శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయ అనుబంధ కళాశాలల రెండింటిలోను అనంతపురము శ్రీ సత్య సాయిమహిళాకళాశాల ఒకటి. యూనివర్శిటీగ్రాంట్స్ కమిషన్ వారిచేయూతతో (ఆర్థిక) వరుసగ సెమినార్సును నిర్వహించింది. 1976–77లో ఒకటి," నీటిలో మృత్తికలో, మొక్కలలోని ఫ్లోరిను. మానవశరీరము పై దాని ఫలితములు.'' రెండవది "తెలుగులో రామాయణ సాహిత్యము.'' 1977–78 లో మొదటిది ''కిరణధార్మిక పదార్థములు," రెండవది "స్వతంత్ర భారతదేశములో జాతీయతయొక్క ఉద్దేశము.'' 1978-79లో ఒకేఒకటి ''జనటిక్ ఇంజనీరింగ్.'' ఈవిధముగ వరుసగ మూడుసంవత్సరములు 5 'సెమినార్లు' జరుపబడిన ఘనత ఈ కళాశాలకే చెల్లినది. ఇంతేకాక "కాసిప్ కళాశాలగ'' కూడ పరిగణింపబడినది. ఇందు వలన పరిశోధనారంగంలో కొన్ని చిరు ప్రాజెక్టులను చేయడము, తద్వారా విద్యార్థినులలో పరిశోధనాతృష్ణను పెంపొందింప చేయడమైనది.

గృహశాస్త్రవాణిజ్యశాస్త్రపు కోర్సులు కూడ నడప బడుతున్నవి. తెలుగు శాఖలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులే కాక, పి. హెచ్. డి. డిగ్రీకొరకు కూడ కొంతమంది కృషిచేయుచున్నారు. ''ఫాకల్టీ ఇంప్రూవ్ మెంట్'' పథకం క్రింద ఈ కళాశాలలోని ఆఱుమంది అధ్యాపకులను పరిశోధనారంగంలో పట్టాలనిమిత్తమై పంపడమైనది. శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయము వారు 'లీడ్' కళాశాలలలో ఈ కళాశాలను ఒకటిగ

పేర్కొనిరి. 1975 లో జాతీయసేవా పథకం కూడ ఈ కళాశాలలో అమలు జరుపబడినది. శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయమునకు ఏదైన 'వర్క్ షాప్' క్రింద వెళ్తే అక్కడివారుకానీ, ఇతర కళాశాలల అధ్యాపకులు కానీ, "సెమినార్స్ చక్కగ నిర్వహిస్తారని, 'కాపిప్' గ్రాంట్స్ వస్తున్నాయని, 'సెమిస్టర్ సిస్టమ్,' ఉందని మాకళాశాలను ఒకే విధంగా పొగడుట తటస్థించుతూన్నది. అప్పుడు కించిత్‌గర్వం పొడసూపినప్పటికి ఇదంత స్వామి కటాక్షమని, స్వామి అదృశ్యఅభయ హస్తచ్ఛాయతో సాగిపోయే కర్మకాండాలని తెలియజేస్తుంటాం. పుట్టపర్తికి చేరువలో ఉన్న ఈ కళాశాలకు ఇతర స్టేట్స్‌నుండే కాక, ఇతరదేశములనుండి కూడ ప్రత్యేకఆకర్షణతో విద్యార్థినులు చేరుతుంటారు.

పైన చెప్పినదంత ఒకభాగం. మరోభాగం ఉంది. ఇదేముఖ్యం. భాషకు అందనిది, భావాతీతమైనది. స్వామి మాకళాశాలకువిచ్చేసిననాడు పండుగయే! హృదయములో ఆనందాంబుధి నిండిఉంటుంది. స్వామి తమ దివ్యపాదపద్మములు మోపగానే అక్కడివాతావరణమంత ఎంతో దివ్యంగా అలరారి అందరి మనసులుపైకిఎగసినట్లుంటాయి. స్వామి పసిడి పలుకులు, సూక్ష్మంగా ఆత్మజ్ఞానాన్ని అందజేయడమేగాక సంసార సాగరములోని ఆటుపోటులకు మనస్థైర్యముతో నిలచేందుకు దోహదంచేస్తాయి ఎటువంటి కల్లోలతను చేరనీకుండ ప్రశాంతతను చేకూరుస్తాయి. స్వామి భజనకీర్తనలు ఆలపించునపుడు, శ్రోతలు మధురగానవాహినిలో ఓలలాడినట్లనిపిస్తుంది. స్వామి కళాశాలాభవనాన్ని వీడగానే మనసుభారమై ఈలోకంలోకివస్తుంది. స్వామి సమకాలంలో జన్మించి, అవతారపురుషుడైన, శ్రీసత్యసాయి బాబావారిని కనులారగాంచి, స్వామిచేయుకార్యములను తిలకించి, వారి హితవచనములను ఆలకించి, స్వామి గానలహరిలో తేలిపోయేవారి ధన్యతే ఏన్యత!

స్వామి పలుకులను స్వయంగా వినలేని మంద భాగ్యులకు 'సనాతన సారథి' లోని శ్రీ వారి దివ్యోపన్యాసాలే అమృతబిందువులు. కళాశాలాసౌధములోని ప్రతిశిలయు స్వామి లీలలనే చాటుతుంది కళాశాలావరణములో వీచే గాలి స్వామి ఊహలనే మోసుకొస్తుంటుంది. కళాశాలలో పూచే ప్రతిసుమములో స్వామి మందస్మితవదనమే గోచరిస్తుంది. కళాశాలాభవన ప్రాంగణములో ఉన్న కొలనులోని కలువలు వనుల పండువుగా అలరారుతూ ప్రతికలువలో హృదయ కమలమే భాసిల్లుతుంది.

మనిషికి ధనమువలన, అది ఒనకూర్చు సుఖాలవలన కలిగేది క్షణికానందం. మనసులో చల్లగ, ప్రశాంతంగ, అతినిర్మలంగ, భావాతీతముగ కలిగే ఆనందమే ఆత్మానందం. ఇటువంటిది ఎవరికివారు అనుభవానికి తెచ్చుకోవాలేగాని మాటలకందదు. అట్టి ఆనందానికి కవాటాలు తెరచి ఆహ్వానించి, ఆనందాన్ని పంచిపెట్టేదే శ్రీసత్యసాయిబాబావారి దివ్యసంకల్పముతో, దివ్య హస్తముతో స్థాపించబడిన శ్రీ సత్యసాయిమహిళా కళాశాల.

**శ్రీమతి కె. భార్గవి, ఎం. ఎస్‌సి., ఎం. ఫిల్.,**

**అనంతపురం.**

# మానవ తత్వము

ప్రేమస్వరూపులారా! ప్రపంచమున ఏ పదార్థమునకైనా కర్త లేకుండా నిర్మాణము జరుగదు. ఇది ఒక వాచీ; ఈ వాచిని నిర్మాణము చేసిన వ్యక్తి ఏ జపానునందో, ఏ జర్మనియందో, ఏ స్విట్జర్లాండ్ నందో, అమెరికాయందో ఉండియే తీరవలెను. ఆ వ్యక్తి వాచీయొక్క తత్త్వము పూర్ణంగా గుర్తించినవాడై ఉండవలెను. అదేవిధముగనే లోకారాధకులైన, లోకపాలకులైన సూర్యుడు, చంద్రుడు, అనంతనక్షత్రములు, కాలమునూ, ఇవన్నియును సృష్టించుటలో, ఆ నాయకత్వము, కర్తృత్వము, పవిత్రమైన ఒక నిర్మాణము తెలిసినవాడు ఒకడు ఉండవలెను. ఈ కర్త సర్వజ్ఞుడై, సర్వవ్యాపకుడై, సర్వమహిమాన్వితుడై ఉండినప్పుడే, సూర్యచంద్రాదులను, నక్షత్రములనూ కాలమును, సృష్టించుటకు అధికారికాగలడు. అట్టి కర్తనే శాస్త్రజ్ఞులు అనేకవిధములైన పేర్లతో ఆరాధిస్తూ, స్మరిస్తూ, తరించుతూ వచ్చారు. ఈ కర్తకు అప్రమేయుడు అని ఒక పేరు. అప్రమేయుడనగా, ఎట్టి ప్రమాణములచేతనూ గుర్తించుటకు సాధ్యము కాని వాడని అర్థము. ఇతడు వేదములకు మాత్రమే వేద్యుడు కనుక వేదవేద్యుడని కూడనూ ఒక పేరు. ఇట్టి సర్వజ్ఞుడైన కర్తను గుర్తించుటకు తగిన ప్రయత్నంచేయడం మానవుని కర్తవ్యం.

ఈ కర్తకు రెండు లక్షణములు కలవు. (1)తటస్థలక్షణం. (2) స్వరూపలక్షణం. తటస్థలక్షణమనగా తాత్కాలికంగా కొన్ని గుర్తులను నిరూపించి ఆ దివ్యత్వమైన ఆత్మతత్త్వాన్ని బోధించుట. ఆ పక్షి కూర్చున్న ఇల్లు ఫలానావారి ఇల్లు, అని చూపడం తటస్థలక్షణం. అనగా ఆ పక్షి ఆ యింటిపైన తాత్కాలికంగా ఆ క్షణమున కూర్చున్నదేకానీ, అది ఆయింటిపైన శాశ్వతంగా ఉండేది కాదు. అదేవిధముగా కొన్ని సద్గుణములు, సత్ప్రవర్తనలు, సదాలోచనలు, సదాచారములు, సచ్చింతలు, కలిగిన సమయమునందు ఇదిదైవత్వము దివ్యత్వము అని నిరూపించడం తటస్థలక్షణం.

స్వరూపలక్షణమనగా సత్, చిత్, ఆనందము. సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ (అనగా సత్యమే బ్రహ్మస్వరూపం, జ్ఞానమే బ్రహ్మస్వరూపం అనంతమే బ్రహ్మస్వరూపం) అని నిరూపించడం. వీటిని అస్తి, భాతి, ప్రియరూప, నామములనికూడా చెప్పవచ్చును. ప్రతి పదార్థమునందు అస్తి, భాతి, ప్రియరూపనామములు మిశ్రమమై ఉంటున్నవి. అస్తి అనగా ఒక పదార్థము 'ఉన్నది' అని తెలుపడం. ఆ వస్తువును ప్రకాశింపచేసి, ఆ ప్రకాశముద్వారా ఈ వస్తువును నిరూపించడము భాతి. మన అవసరము బట్టి దానిని ప్రీతి చేయడము, ప్రియము. ఇవి మూడుకూడనూ దివ్యమైన దైవగుణములు. ఇవి ఆధారములైనవి. ఇక రూపనామములు ఆధేయమైనవి. ఇట్టి అస్తి, భాతి, ప్రియరూపనామములను నిరూపించుటకు మూడు విధములైన ప్రమాణములుంటున్నవి. మొదటిది, ప్రత్యక్షప్రమాణము; రెండవది, అనుమాన ప్రమాణము; మూడవది శబ్దప్రమాణము. ప్రత్యక్షప్రమాణమనగా!

ఒక చిన్న ఉదాహరణము; ఈ నాటి రాత్రి పాలుగా

ఉంది, దానికి తోడంటువేసినప్పుడు అది రేపటి దిన మునకు పెరుగుగా మారుచున్నది. ఇది ప్రత్యక్ష ప్రమాణము. మానవుని సాధనలచేత, ప్రయత్నముల చేత, సంకల్పములచేత మరుక్షణమునందు మరొక రూపంగా తీర్చిదిద్దుకోవడం ఇది ప్రత్యక్షప్రమాణం. ఇది అనుభవప్రమాణమనికూడా చెప్పవచ్చును. అనుమాన ప్రమాణమనగా దూరమునందున్న పర్వతములో పొగను చూచి అక్కడ నిప్పుఉన్నది అని నిరూపించుటకు ప్రయత్నించడం. అగ్ని మనకు కనిపించక పోయినప్పటికినీ, పొగను చూచి అనుమానంచేత అక్కడ అగ్ని ఉండవచ్చును. అని చెప్పడం, ఇది అనుమాన ప్రమాణం. ఇక శబ్దప్రమాణము. కాశీని చూచివచ్చిన వ్యక్తి కాశీక్షేత్రముయొక్క వర్ణనను వాక్కు ద్వారా కాశీచూడని వ్యక్తికి నిరూపించడము. అయితే ఈ శబ్దప్రమాణమునందు మరి రెండు రకములైన ప్రమాణములు కూడా కూడి యున్నవి. 1. లౌకికప్రమాణము. 2. వైదిక ప్రమాణము. లౌకికప్రమాణము దైవత్వాన్ని తాను నిరూపించుటకు పూనుకొనదు. ఇంక వైదికప్రమాణము ప్రత్యక్షస్వరూపమైన దివ్యత్వాన్ని నిరూపించే పవిత్రతకలిగి ఉంటుంది. కనుక ఈ వైదికప్రమాణాన్ని పురస్కరించుకుని ప్రతిమానవుడు కూడనూ కర్తయైన భగవంతుని కొంతవరకు గుర్తించడానికి ప్రయత్నించడం ఆత్యవసరం. ఇక్కడ దివ్యత్వమైన మానవత్వం ధరించి, పవిత్రమైన ఆత్మను మనము స్వీకరించి తద్వారా దైవత్వమనే దారిని ప్రయత్నపూర్వకముగా సాధించినప్పుడే, మానవత్వంలో ఉన్న దివ్యత్వముకూడనూ ప్రకటించిన వారమవుతాము.

మానవత్వములో ఉన్న దివ్యత్వము ప్రకటించడానికి, అనుభవించడానికి, ఆచరించడానికి అనేక విధములైన సులభోపాయములు లేకపోలేదు. నిజముగా మానవునికి అనేక విధములైన అపేక్షలలో ప్రధానమైన అపేక్ష ఒకటి కలదు, ఆ యపేక్ష అకుంఠితమైన ఆనందము కావలెనని ఆశ. కానీ, ఇట్టి ఆనందమునకు రాత్రింబవళ్ళు అనేక విధములైన శ్రమలుపడి తద్వారా నిరాశకు గురి అవుతున్నాడు. నిర్విరామ కృషిచే, నిరంతరతాపత్రయములతో, అంతులేని ఆశలతో, అర్థముకాని ఆవేదనలతో, అప్రాప్త రూపప్రాప్తికై ప్రాకులాడే మానవుడు అశాంతికి గురియై కొంతవరకు నిస్పృహతో విరిగిపోతున్నాడు. కారణమేమిటి? తాను ఆశించిన ఆనందము దేహేంద్రియములయందు లభించునని భ్రమించి దేహేంద్రియములవెంట పరుగిడుతున్నాడు. కానీ, ఆనందస్వరూపుడననే సత్యాన్ని గుర్తించుకోలేకపోతున్నాడు.

సహజముగా పిండికి తియ్యదనమనేది ఉండుటకు వీలుకాదు. ఏ పిండిఅయినప్పటికినీ, బెల్లము చేరినప్పుడే మాధుర్యము చేకూరుతున్నది. ఈ ప్రపంచమంతయూ పిండివంటిది. ఈ జగత్తనే పిండియందు దైవత్వమనే మాధుర్యము, (బెల్లము)కూడినప్పుడే పిండి సర్వత్రా మాధుర్యాన్ని చూపిస్తుంది. నిజముగా ఈ జగత్తునందు సర్వవ్యాపకమైన దివ్యత్వము సర్వత్రాకూడిఉండటంచేతనే జగత్తును ఈ నాడు మనం ఆకర్షింపగలుగుతున్నాము. ఆకర్షణ, సౌందర్యము, పవిత్రమైన ప్రేమ ఎక్కడ కలదో అక్కడంతయూ దైవత్వమే తాండవమాడుతున్నది. కేవలము దేహేంద్రియముల భ్రాంతికి గురియై మానవుడు తనయందున్న దివ్యానందమును, భవ్యానందమును గుర్తించుకోలేకపోతున్నాడు.

జగమునందున్న ప్రతి చరమునకు ఒక స్థిరమైనది ఉంటున్నది ఆధారమై. ఇది ఒక మాల.

మనకు కనిపించునవి పుష్పములు. కానీ, ఈ పుష్పములు తమంతతాము నిలుచుకుని ఉండుటకు వీలు కాదు. ఈ పుష్పములను బంధించిన దారము ఇందులో ఉన్నది. పుష్పములు అనేకములు. పుష్పములను బంధించిన దారము ఏకము. అనిత్యమైన, అనేకమైన పుష్పములను పరిశీలించినప్పుడే, ఆధారమైన దారమును గుర్తించడానికి వీలవుతుంది. ఈ వైపున ఉన్నపూలు అటువైపున, అటువైపున ఉన్న పూలు ఇటువైపున నెట్టి వేసినప్పుడే మధ్యనున్న దారము మనకు కనిపించుతుంది. అదేవిధముగనే అనిత్యమై, అశాశ్వతమై, అసత్యమై ఉన్న రూపనామములను రెండువైపులా నెట్టినప్పుడే అందులో ఉన్న ఆధారమైన ఆత్మతత్త్వము మనకు అర్థమవుతుంది. కేవలము రూపనామములయందే మన జీవితమును అంకితం గావించుకుని, ఇదియే సత్యము ఇదియే నిత్యమని విశ్వసించి తద్వారా అంధకారబద్ధులమై పోతున్నాము.

కదలే ప్రతిపదార్థమునకూ కదలని స్థిరమైన తత్వము ఒకటి ఉన్నది. మనము రోడ్డుపైన కారులో కదలి పోతున్నాము. కారు కదలుచున్నదే కానీ రోడ్డు కదలడం లేదు. అదేవిధముగనే నిత్యము అనుభూతిలో ఉండే సినిమాలు; అనేక బొమ్మలు వస్తున్నాయి పోతున్నాయి. కానీ, దాని తెరమాత్రము కదలడం లేదు. 74000 నాశములచేత కదలిపోతున్న ఈ దేహమునందు కదలని ఆత్మతత్త్వము ఒకటి ఉన్నది. అదే విధముగనే జగత్తునందున్న ప్రతి పదార్థముకూడనూ చలనమైనదేకానీ స్థిరమైనదికాదు. మానవత్వములో స్థిరమైన, పవిత్రమైన ఆత్మతత్త్వాన్ని పరిశీలన చేయాలి.

భారతీయసంస్కృతి, విజ్ఞానమహాసముద్రము. అనాదికాలమునుండి భారతీయసంస్కృతిపైన అనేక విధములైన అవాంతరములు వ్రాలి దానిని క్షీణింప చేయడానికి ప్రయత్నాలు సలుపుతూ వచ్చాయి. బుద్ధ మతమ్ము, జైనమతమ్ము, ముస్లిమ్‌మతమ్ము, క్రిష్టియన్ మతమ్ము, ఇంకా అనేకమతములు భారతీయమతమును ఛిన్నాభిన్నము చేయుటకై పూనుకొన్నాయి. కానీ సర్వమతసమ్మిశ్రితమైన మతిస్వరూపమే ఈ మతమనే సత్యాన్ని గుర్తించుకోలేకపోయారు. అన్ని మతములుకూడను ఒక్క దివ్యత్వాన్ని బోధించే సత్య సూక్తులు అని గుర్తించుకోలేకపోయారు.

మతము లన్ని చేరి—మంచినే బోధించె
తెలిసి మెలగ వలెను—తెలివితోడ
మతులు మంచి వైన—మతమేమి చెడ్డది?
వినుము భారతీయ—వీరసుతుడ!

ఈ నాడు మతసంబంధమైన భేదములచేత మానవత్వాన్నే మరచి కేవలము దానవత్వంగా విజృంభించి పోతున్నారు. కొంతమంది స్వార్థపరులు కులతత్త్వాలతో కుస్తీలు చేస్తున్నారు. మతతత్త్వాలతో మారణ హోమం సృష్టిస్తున్నారు. భారతీయసంస్కృతిని ఎవ్వరు ఎన్నివిధముల తూలనాడినప్పటికినీ, దానిని చెడుటకు ఎన్ని విధముల ప్రయత్నము చేసినప్పటికినీ ఇది అసాధ్యమయ్యేవిషయం. సముద్రమునకు ఎన్ని 'పంప్‌సెట్' లు వేసికొట్టినప్పటికినీ సముద్రము ఖాళీ చేయడానికి వీలవుతుందా? సముద్రములోనికి ప్రవహించు నదులు ఎండిపోయిననూ లేక అధికంగా ప్రవహించిననూ సముద్రము పెరగటంకానీ తరగటంకానీ ఉండదు. అదేవిధముగా భారతీయసంస్కృతిని ఎందరు ఎన్నివిధములుగా పరాభవింప చేయడానికి ప్రయత్నము చేసినప్పటికినీ ఇది ఏనాటికీ చెక్కుచెదరక, కట్టుకదలక నిత్యమై సత్యమై ఉంటుందే దివ్యత్వాన్ని ధరించినటువంటిది.

—శ్రీవారి దివ్యబోధ. 9-12-79.

# "హిందూ మతము"

వేదశాస్త్రంబులు—వివరించి బుధులచే
చదివించవచ్చు తా—చదువవచ్చు
యజ్ఞయాగతపము—లధికారి జనులచే
చేయించవచ్చు తా—చేయవచ్చు
ఇలలోనగల తీర్థ—ములకేగ నన్యుల
బోధించవచ్చు తా—పోవవచ్చు
అష్టాంగయోగ సి—ద్ధ్యార్యులకనుబోధ
సలుపంగవచ్చు తా—సలుపవచ్చు.
కాని తమమనోబుద్ధ్యహం—కారములను
నిల్పియంతర్ముఖము చేసి—నియతితోడ
నిశ్చల సమాధినిష్ఠులై—నిలువలేరు.
వినుడు భారతీయులరు మీ—రనవరతము.

దివ్యాత్మస్వరూపులారా!

వేదకాలమునుండి భారతదేశమునందు అవిచ్ఛిన్నముగా కొనసాగుచూవచ్చుచున్న మతము హిందూమతము. ఆదినుండి ఈ హిందూమతమునకు అనేకవిధములైన ప్రమాదములు, వెంటాడుతూ రావడంచేత వాటి నన్నిటినీ ధైర్యంగా ఎదుర్కొని ఇన్నియుగములు ఇది చెక్కుచెదరక కట్టుకదలక నిలిచియున్నదంటే, హిందూమత విశిష్టతవిజ్ఞులు ఎంతేనిగొప్పగా కొనియాడవచ్చును. శతాబ్దములతరబడి హిందూమతము అనేకవిధములైనసంప్రదాయములను, సంస్కారములను సమన్వయముచేసి రక్షించుకుంటూరావడము మహావిశిష్టమైన ఘనకార్యము.

హిందూమతము దైవనిర్మితమైనది; దైవప్రీతికరమైనది; దైవమిళితమైనది, సర్వమతసమన్వయమును, ప్రబోధించి, ప్రచారము సలిపేమతము హిందూమతము. 'హిందూ' పదమునకు అనేకమంది అనేకవిధములైన అర్థమును చెప్పుతూరావచ్చును. ఎన్నో విధములైన వ్యాఖ్యానములు చేయవచ్చును. వ్యుత్పత్తులను ప్రబోధించవచ్చును. కానీ, నిజమైన 'హిందూ' శబ్దమునకు, హిం హింసను, దూ దూరము చేసేది, అని అర్థము. హింసను దూరం చేసేదే హిందూదేశము. ఆదేశమువారనుసరించునదే హిందూమతము. ఇదే దీని అంతరార్థము. హింసను ఏ మాత్రమూ అంగీకరించనిది హిందూదేశము; హిందూమతము. సర్వదేశముల యొక్క సుక్షేమాన్ని ఆశించేది హిందూమతము. 'ఈశావాస్యమిదంసర్వం' అనే దివ్యసూక్తులను ప్రబోధించ చేసేది హిందూమతము. దేశ, కాల, పాత్రలకు అతీతమైన దివ్యప్రబోధలను గావించి, నాటినుండి నేటివరకు అనేకవిధములైన సాంప్రదాయములు జరిగినప్పటికినీ, యుగములు మారినప్పటికిని జగములు తిరిగినప్పటికిని, తనస్వచ్ఛమైన దివ్యత్వాన్ని జనులకు ప్రబోధిస్తూవస్తున్నది. లోకక్షేమమునకు, లోకకల్యాణమునకు ఈవిధములైన యజ్ఞయాగాదిక్రతువులు శతాబ్దముల తరబడి చేస్తూవస్తున్నారు. ఇది ఒకకులమునకు కానీ, ఒక మతమునకు కానీ ఒకతెగకు కానీ, ఒక వర్ణమునకు కానీ, వ్యక్తికికానీ సంబంధించినది కాదు. లోకమునకే సంబంధించినది.

'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు', ఇదియే యజ్ఞము యొక్క ఆశయము. అందువలననే ప్రాచీనకాలము

నందు ఋషులు ఏగ్రామమునకు, ఏతెగకు, ఏపట్టణము నకు సంబంధిచక అరణ్యములో అన్నిగ్రామములకు సమీపంగా ఉండేట్లుగా ఉన్నతమైన, ఉత్తమమైన ఒక ప్రదేశము ఎన్నుకుని అక్కడ యజ్ఞశాలను నిర్మించి యజ్ఞయాగాదిక్రతువులను నలుపుతూ వచ్చేవారు. అరణ్యమునందు ఈ యజ్ఞమును జరపడంచేత, చుట్టు ప్రక్కల ఉండే పల్లెవారుకానీ, పట్టణవాసులు కానీ, ఆప్రదేశమునకు చేరి సర్వులకును సమానమైన ప్రదేశమునందుపవిత్రమైన హృదయముతో యజ్ఞమును అనుభవించేవారు. ఒకరిని యాచించి యజ్ఞము చేయటము పవిత్రమైనది కాదని ఆనాటి ప్రబోధలు. యజ్ఞమునకు వెళ్ళే ప్రతివ్యక్తి కూడ పట్టెడు నవధాన్యములను తీసుకునిపోయి ఒకప్రదేశమున పూడ్చి, ఆ నవధాన్యముల చేతనే యజ్ఞమును ఆచరిస్తూవచ్చేవారు. ఈ వ్యక్తులు తెచ్చిన నవధాన్యములనన్నింటినీ ఒక దగ్గరకలిపి (దీని యొక్క అంతరార్థము అందరి హృదయములు ఏకత్వముచేసి) తద్వారా హోమమును గావించడానికి పూనుకొనేవారు ఆనాటి మహర్షులు. ఋత్విక్కులు కూడనూ, తమకు చేతనైనన్ని సమిధలు తీసుకొని వచ్చి వాటిని కలిపి యజ్ఞహోమములగావించేవారు. కనుక దీనిఫలము సర్వులకు సమానముగా ఆనాడు అందెడిది. ఇదియే ఆనాటి యజ్ఞముల పవిత్రత. ఈనాడు స్వార్థము, వ్యక్తిత్వము, అభిమానము అధికం కావడంచేత యజ్ఞ పవిత్రతయే శూన్యమైపోయింది. అహంకారము, అభిమానము, స్వార్థము బలపడిపోవడంచేత యజ్ఞ పవిత్రత కూడా, మనకేమాత్రమూ కనిపించకపోవుచున్నది. కనుకనే ఈనాడు యజ్ఞమనేది హాస్యాస్పదమైన రూపములో జగత్తునకు కనిపించుచున్నది.

౮ః యజ్ఞములు రెండురకములుగా ఉంటున్నవి: అంతర్యజ్ఞము, బహిర్యజ్ఞము, అని. బహిర్యజ్ఞము అంతర్యజ్ఞప్రతిబింబమే: కాలకర్మకార్యకర్తృత్వాల్ని పురస్కరించుకుని నేటి పరిస్థితులయందు బహిర్ముఖమైన యజ్ఞప్రతిబింబమే, అంతర్ముఖంగా భావిస్తున్నారు: అంతర్ముఖమైన యజ్ఞము చేతిలో పట్టుకున్న పిట్ట: బహిర్ముఖమైన యజ్ఞము పొదలోనున్న పిట్ట. కానీ పొదలోనున్న పిట్ట చేతిలోనున్న పిట్టయొక్క ప్రతిబింబమే: ఈనాడు పవిత్రవాతావరణాన్ని కోల్పోవటంచేత చేతిలోనున్న పిట్టను వదలి, పొదలోనున్న పిట్టకోసం ప్రాకులాడుతున్నారు ప్రజలు. ఏతావాతా అంతర్యజ్ఞముల పవిత్రతను ప్రతివ్యక్తి కూడా గుర్తించడం అత్యవసరం.

అంతర్యజ్ఞమనగా మనయందు గూఢంగా, గుప్తంగా దాగి ఉన్న దైవత్వాన్ని మనము ఆరాధనచేత అనుభవించడమే. ప్రతిమానవునియందు దైవత్వము, నిరంతరము దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉన్నది. ఆ దైవమునకు మనస్సనే యజ్ఞవేదికపైన మనలో ఉన్న దుర్గుణములనెడి పశుత్వాన్ని బలి చేయడమే యజ్ఞముయొక్క నిజమైన సారము. మానవుడు సహజసిద్ధముగా మానవుడిగానే పుట్టుటలేదు. అనేక విధములైన జంతుజన్మములనుండి ఈ మానవత్వము కట్టకడపటికి మనకు ప్రాప్తిస్తూ ఉన్నది. పాతజన్మముల వాసనలు, గుణములు, ప్రవర్తనలు, మానవునియందు మిగిలి ఉంటాయి. చేతిపైన ఏదైనాపుండు వచ్చిందంటే, పుండు మానిన తర్వాతకూడ కొంతవరకు మచ్చ ఉంటుంది. అదేవిధముగనే పూర్వజన్మ సంస్కారములు ఈ జన్మమునందు మిగిలి ఉంటాయి.

దీనికి గుర్తేమిటి? దీనికి సాక్ష్యమేమిటి? మానవునియందు కొంతమాత్రమైననూ మదమనేది పీడిస్తూఉంటుంది. ఈ మదము మానవుని గుణముకాదు. ఇది గజముయొక్క గుణము. కనుక మనము పూర్వజన్మములో ఎప్పుడో ఏనుగుగా ఉండి దానిగుణము మనలో అంతో యింతో మిగిలి ఉంటున్నది. రెండవది మూర్ఖత్వ

మనేది. మూర్ఖత్వమనేది గొఱ్ఱెలక్షణం. కనుక ఏనాడో మనము గొఱ్ఱెలుగా పుట్టి జీవించినాము. మరికొంతమందియందు అధికంగా కన్పిస్తూ ఉంటుంది దొంగతనము. దొంగతనమనేది పిల్లిగుణము. దీనిని బట్టి ఏ జన్మలోనో మనము పిల్లిగా పుట్టి ఉండవచ్చు. ఇంక సర్వసాధారణంగా చంచలత్వమనేది నూటికి నూరుపాళ్ళు ఉంటుంది మానవునియందు. ఈ చంచలత్వమనేది కోతిగుణము. మనము ఈ మానవత్వమునకు పూర్వము కోతులుగా ఉండినాము. కోతికి 'వానర' అని పేరు. ఇప్పుడు 'వా' పోయింది. 'వా' అంటే వాలము. ఆ వాలము లేనటువంటివాడు కాబట్టి మానవునకు 'నరు' డని పేరు పెట్టారు. వాలముతోకూడింది కాబట్టి వానర మని పిలువబడింది. ఆ వాలమును పోగొట్టుకున్నాము, కానీ దాని గుణములను ఇంకాపోగొట్టుకొనలేదు. కనుకనే అనేకజన్మలు ఎత్తి పశుత్వాన్ని కొంతవరకు మనలో త్యజింపచేసుకున్నాము. ఆ పశుత్వాన్ని మనస్సనేవేదికపైనపెట్టి భగవంతునికి బలిగా ఇవ్వడము అనేదే ఈ యజ్ఞము యొక్క అంతఃఫలితము.

—భగవానుని దివ్యబోధ, 25-9-79.

# పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 5. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 10. | భజనావళి | 2-00 | 0-20 |
| 11. | మణిమాల | 2-00 | 0-20 |
| 12. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 13. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 14. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 15. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 16. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 17. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 19. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 20. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 21. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 22. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 23. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్కకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే. "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 96 వ పుటలో చూడండి)

Regd. No. KRNU—83 APRIL 1980

తాను ఆత్మయేకానీ, దేహముకాదు; తాను వికారము చెందని వాడు; వికారము చెందెది, నశించేది, మరణించేది దేహముకానీ. నేను కాదు। నేను 'సత్' అని మరిమరి స్మరించుకొనుటయే భూతాకాశముయొక్క అంతరార్థము.

నేను మృణ్మయముకాదు, చిన్మయుడను. నేను జ్ఞానస్వరూపుడను, తెలివి నాస్వభావము, చిదానందము నా శ్వాసము అనే సత్యమును మరిమరి స్మరించడము, జ్ఞానతత్త్వములోనే మునిగియుండటము. దాని వలన చిత్‌శక్తిని అభివృద్ధి చేసుకొని జీవితమును సార్థక పరచుటయే, చిత్తాకాశముయొక్క అంతరార్థము.

ఇంక చిదాకాశము. సంసారమనే దుఃఖమునందు కుమిలి కుమిలి నశించే క్రిమికీటకాదులు కాదు నేను। నిరంతరమూ నిత్యానందములో ఓలలాడుచున్నవాడను నేను। బ్రహ్మజ్ఞానాధిపతిని. నేను అద్వైతస్వరూపుడను, అని దుఃఖవిముక్తుడనుగా ఆనందస్వరూపుడనుగా ఉండటమే, చిదాకాశముయొక్క అంతరార్థము.

Regd. with Registrar of Newspapers No. RN/10772/64